శ్రీలక్ష్మీహయగ్రీవో విజయతేతరామ్.

# బాలబోధినీ

—∘∘✻∘∘—

## ఏకోనచత్వారింశః పాఠః = ముప్పదితొమ్మిదవ పాఠము

| | |
|---|---|
| సా = ఆమె | అభిముఖం = ఎదురుగా |
| ఏషా = ఈమె | పరితః = చుట్టుకొని |
| కా = ఎవతె ? | ఈషత్ = కొంచెము |
| సర్వా = ప్రతిది | పరశ్వః = ఎల్లుండి |
| ఏకా = ఒకతె | ప్రపరశ్వః = అవతలెల్లుండి |
| అన్యా = మఱియొకతె | ప్రహ్యః = మొన్న |

లంబ్ = వ్రేలాడుట

| | వర్తమానము | | భూతము | |
|---|---|---|---|---|
| | ఏ. | బ. | ఏ. | బ. |
| ప్ర. | లంబతే | లంబంతే | అలంబత | అలంబంత |
| మ. | లంబసే | లంబధ్వే | అలంబథాః | అలంబధ్వం |
| ఉ. | లంబే | లంబామహే | అలంబే | అలంబామహి |

సా అంగనా కస్య పుత్రికా వా, కిమర్థం గంగాసమీపే సంచరతి వా ఇతి ఏకః నృపః మాం ప్రహ్యః అపృచ్ఛత్. తదా అహం ఈషత్ ఆలోచ్య హే నృప! అహమపి తద్వృత్తాంతం సర్వం విచార్య అనంతరం వదిష్యామి; తావత్పర్యంతం అత్ర ఏధి ఇతి అవదం. తతః సః భూపాలః గంగాతీరే ఏకస్మిన్ లతాగృహే ఈషత్పర్యంతం ఉషిత్వా, పునః అపి బహిః ఆగత్య మాం ఆహ్వాయత్. తదుపరి అహం రాజసమీపం గత్వా

బాలబోధినీ

హే భూపాల! ఏషా మమ వచనస్య ప్రత్యుత్తరం నాయచ్ఛత్. కింతు అహం పునః పునః అపృచ్ఛం; తథాపి నా తూష్ణీం ఆసీత్. త్వమేవ గత్వా పృచ్ఛ – ఇతి తం నృపం అవదం. పశ్చాత్ సః నృపః తథాఏవ అకరోత్.

పిమ్మట రాజును జూచి ఆ యాఁడుది ఓ రాజా నాయూరు యొక్కయు నాయొక్కయు పేరు నీకెందుకు? నీవు (నీత్రోవను) = (తవ మార్గేణ) వెళ్లుమని చెప్పెను. (ఈలోపల) = (ఏతదంతరే) ఒకదొంగ అక్కడ చెట్టుమీఁద వ్రేలాడుచుండెను. వాఁడు ఈ స్త్రీని దొంగిలించుకొని పోవుటకు వచ్చినాఁడని రాజు వానిని దండించెను. (ఇట్లుండగా) = (ఏవంస్థితే) మఱియొక్కతె ఆరాజును చూచి ఈవేళ మాయింట్లో భోజనమును చేయుటకు నీవు రమ్మని రాజును పిలిచెను. ఓసీ! నీవెవతెవు? అని రాజు అడిగెను. అది నేనొకశూద్రునియొక్క పెండ్లామును అని జవాబుచెప్పెను. పిమ్మట ఓసీ నేను క్షత్రియుఁడనుగదా, మీ యింట్లో ఎట్లు భోజనమును చేయుదును? నేను మీ యింటికి రాను పొమ్ము అని చెప్పెను. ఆమెయు వెళ్ళెను.

## చత్వారింశః పాఠః = నలుపదవ పాఠము

| | |
|---|---|
| గమనం = వెళ్ళుట | గత్వా = వెళ్ళి |
| ఆగమనం = వచ్చుట | ఆగత్య = వచ్చి |
| కరణం = చేయుట | కృత్వా = చేసి |
| మరణం = చచ్చుట | మృత్వా = చచ్చి |
| ధావనం = పరుగెత్తుట | ధావిత్వా = పరుగెత్తి |
| పఠనం = చదువుట ॥మొ॥ | పఠిత్వా = చదివి ॥మొ॥ |

జ్ఞా = తెలియుట.

జ్ఞాయతే = తెలియును, తెలియఁబడుచున్నది
అజ్ఞాయత = తెలిసెను, తెలియఁబడెను
జ్ఞాస్యతే = తెలియఁగలఁడు, తెలియఁబడఁగలఁడు

లంబిష్యతే = వ్రేలాడఁగలఁడు
జ్ఞాపయతి = తెలుపుచున్నాఁడు
లంబయతి = వ్రేలాడవేయుచున్నాఁడు

అరే బాలక! నాగదంతే మమ అంగవస్త్రం లంబయ, నోచేత్ గృహేవా లంబయ. భోబాలక! తక్రే మక్షికాః పతిష్యంతి కింవా గత్వా పశ్యసివా నవా. కటాహే జలం అస్తి రే నోచేత్ త్వం ఝటితి తటాకం గత్వా పానీయం ఆనీయ కటాహం పూరయ. అనేకే బాంధవాః స్నానార్థం ఆగచ్ఛన్. హ్యః నక్తం మమ నిద్రాసమయే ఏకః ఖనకః ఆగత్య అన్నపాత్రం అధః అపాతయత్. అనంతరం ఏకః మూషకః మమ కసిష్ఠికాం శనైః అదశత్. తత్ర ఘరట్టసమీపే ముసలం అస్తి; ఇత్థం ఆనేష్యసి కిం? ఘరట్టః కుత్రాస్తివా మయా నజ్ఞాయతే. తవ పఠనానంతరం త్వమేవ గత్వా ఆనయ ముసలం. హ్యః ప్రాతః అస్మదావరణే ఏకం శూర్పం ఆసీత్. తస్మిన్ ఏకః రక్తపుచ్ఛః అవసత్. తం దృష్ట్వా తవ అనుజః అమారయ ద్రే, అబ్రహ్మణ్యం! మంథానః కటః ఉలూఖలం చ ఏకత్ర ఏవ సంతి. హే అంబ! మమ చేలం జలే అపతత్, ఈషత్ శోషయిష్యసి కిం?

యుష్మద్గృహే అద్య ప్రాతః దశ నకులాః అహ మపశ్యం. తేషాం మధ్యే ఏకః నకులః కుసూలే పతిత్వా ధాన్యం సర్వం అఖాదత్.

నీకు ఆఁడుపిల్ల లెందఱయ్యా? నాకు ఒక్కతే కూఁతురు. ఆలాగా? ఎందుకురా ఆపిల్లను ఆలా బాధ పెట్టుచున్నావు? నీకేమి తెలియును, నిన్న నన్ను చెఱువుదగ్గర కొట్టినది. అయితే సరే. మొదట తెమ్ముని, పాలను త్రాగించి తరువాత పరుండఁబెట్టుము. వాఁడెక్కడ నుండెనో నీకు తెలియునా? చూడుము వాఁడు ఆ చెట్టుమీఁద వ్రేలాడుచున్నాఁడు. నీవు మెల్లగా అక్కడికి వెళ్ళి వానిని తీసికొనిరమ్ము. కాని వానిని భయపెట్ట వద్దు. లేకపోతే వాఁడు చెట్టునుండి పడును. మీకు గుఱ్ఱము లెన్ని యున్నవి, ఎద్దు లెన్ని యున్నవి? నాన్నా! మనయింట్లో దోసపరు గున్నదా? నులకమంచముమీఁద కంబళి యుండెనే ఎవఁడు తీసికొని వెళ్లినాఁడు? నిన్న ఒకబల్లి మజ్జిగలో పడ్డది. అబ్బాయిని బాగుగ మొదట చదివింపుము, వెనుక వ్రాయింపుము. ఈరవికను ఎవరు అక్కడ వ్రేలాడ వేసినారు? తీఁగ యందు పూఁలు బొత్తుగా లేకున్నవి.

ఏకచత్వారింశః పాఠః = నలువదియొకటవ పాఠము

| | |
|---|---|
| రథ్యా = బజారు—రస్తా | ఏకవారం = ఒకమారు |
| ద్వారం = వాకిలి | ద్విః = రెండుమారులు |
| గర్భగృహం = గది | త్రిః = మూడుమారులు |
| లేఖనం = వ్రాయుట | చతుఃకృత్వః = నాలుఁగుమార్లు |

మారణం = చంపుట
పతనం = పడుట
పంచకృత్వః = అయిదుమార్లు
లిఖిత్వా = వ్రాసి

ఆలోచయతి = ఆలోచించుచున్నాఁడు
ఛేదయతి = కోయుచున్నాఁడు
విచారయతి = విచారించుచున్నాఁడు
నిష్పీడయతి = పిండుచున్నాఁడు
వ్యచారయత్ = విచారించినాఁడు ; నిరపీడయత్ = [పిండినాఁడు.

గర్భగృహే కటః అస్తి, శీఘ్రం మార్జయ. బహిః కేవా రథ్యాయాం సంతి తాన్ అంతః ఆహ్వాయ. కటే అనేకే మత్కుణాః సంతి. సర్పాన్ దర్శయతః కింవా — తవ అంబా కిమర్థం ఖనిత్రేణ అవటే ఖనతి? ఛురికాం ఆనయరే ఉర్వారుకం ఛేదయిత్వా భక్షయామ. అరేరే శునకః తం శశం ద్రావయతి రే మారయిష్యతి కింవా కిం కరవామ. ఆవరణే పుష్పాణి సంతిచేత్ దేవపూజార్థం శీఘ్రం మానయ. హే బాలికే! తత్ర గోమయేన కిం కరోషి? రామః పాఠం పంచకృత్వః లిఖిత్వా శతకృత్వః అపఠత్. అరే తూష్ణీం ఆలోచయసి కింరే. ఫలకోపరి బాలకః అస్తివా నవా విచారయ. భోజనక! అనుజః మండపస్య అధః నవనీతం ఖాదతి: కించ క్షీరమపి పిబతి. పిబతిచేత్ పిబతు, త్వం తూష్ణీం ఏధి. మమ వస్త్రం కః నిరపీడయత్? తే బాలకాః నిరపీడయన్. ప్రతిదినం ప్రాతః సాయంచ దేవస్య ద్విః నమస్కారం కురు ; త్రిః సంధ్యావందనం కురు. శివరాత్రిదినే ఏకవారం దివా వా, నక్తం వా ఫలాహారం కురుత — ద్వారే ఖరః అస్తి: దూరం ద్రావయ.

గాంగిలో నూనెను పోయుము. వారు కొంచవలెనో తీగెను కోసిరి. ఆఁబోతు నిన్న సంజెవేళ మాయింటిలో పిండిని తిన్నది. గోడయందు బల్లిని పిల్లి చంపినది. గబ్బిలము గిన్నెలో నూనెను త్రాగినది. అరే అరే పాములు వెళ్ళుమన్నవి చూచినావురా! లేదు లేదు; పాములు కావు, ఉడుతలురా. అయితే తేళ్ళు అని చెప్పెద వేమి? దేవుఁడు వాహనము మీఁద వచ్చుచున్నాఁడు. ఇవ్వేళ మీరు కంచములో అన్నమును తినుచున్నా రేమి? మాయింటిలో ఆకులు లేవుగా. తలుపుదగ్గర ఆపాడు మేమి? మాయింటిలో ఇవ్వేళ వంకాయ కూరను వండించినాము. మీయింటిలో చాలదోమ లున్నవిరా. నీపడుటతర్వాత నిన్ను నేను మళ్ళీ చూడలేదు. రేపు నాకు మీ పెయ్యదూడను చూపించుము. మీ ఆవు పాలు ఇచ్చుచున్నదా? చంటిపిల్లకు గజ్జెలు లేవు. పోనిమ్ము.

## ద్విచత్వారింశః పాఠః = నలుపదిరెండవ పాఠము

| | |
|---|---|
| మల్లికా = మల్లె | అంతతః = చివరకు |
| కృష్ణా = కృష్ణ | ఇతస్తతః = ఇటునటు |
| గంగా = గంగ | పిష్టద్య = పిండి |
| గోదా = గోదావరి | ప్రసార్య = పఱచి ॥మొ॥ |
| గంగాలయః = గంగాళము | స్థిత్వా = ఉండి–నిలిచి |
| స్థితః = ఉన్నవాఁడు | స్థాపయిత్వా = ఉంచి, నిలిపి |

ప్రసారయతి = పఱచుచున్నాఁడు – చాచుచున్నాఁడు

ప్రసారయిష్యతి = పఱచఁగలఁడు – చాచఁగలఁడు

పరిసారయత్ = పఱచెను - చాచెను
ఆరోహతి = ఎక్కుచున్నాడు
ఆరోపయతి = ఎక్కించుచున్నాడు
ధరతి = కట్టుకొనుచున్నాడు - తాల్చుచున్నాడు

మల్లికాలతాయాం పుష్పాణి సమ్యక్ సంతి. తత్రస్థితః బాలకః కః? రామానుజాచార్యస్య పుత్రః ఖలు. గోదాసమీపం గత్వా మమ వస్త్రాణి సమ్యక్ ధావ. కృష్ణాజలేన గంగాలయం పూరయ. కటం పరిసారయామః. మమ ఉపాధ్యాయః ఆగత్య ద్వారాత్ బహిః ఈషత్కాలం స్థిత్వా పునరపి కుత్ర వా అగచ్ఛత్. ఏతం బాలకం సంస్కృతవిద్యాం శిక్షయామః. ఖనిత్రేణ వనే రామః ఖనతి. హే అంబ! చేలం అత్రాస్తి ధర. తే బాలకాః యుష్మత్పుత్రం వృక్షం ఆరోపయంతి పశ్యత. సః పతేత్ చేత్ కథం? అరే విధవ! త్వం కిమర్థం వృక్షమారోహసి రే. మమ అంబా అనుజం గర్భగృహే మంచోపరి శాయయతి. సా అంగనా క్షీరపాత్రం అంతర్గృహే స్థాపయిత్వా స్వగృహమగచ్ఛత్. హంజే బాలికే! మమ చోలం సమ్యక్ నిష్పీడ్య శోషయ. అహం గోదాయాం స్నానం కృత్వా తత్ర సంధ్యావందనం కృత్వా అనంతరం గృహం ప్రతి ఆగమిష్యామి. సః బాలకః ఇదానీం సమ్యక్ న పఠతి, అంతతః ఖరః భవిష్యతి కింవా. పాకః ఆసీత్ చేత్ పర్ణాని పరిసార్య బహిస్థితాన్ బ్రాహ్మణాన్ భోజనార్థ మాహ్వాయ. హే జనక! బ్రాహ్మణాస్సర్వే స్నానం కృత్వా స్వవస్త్రాణి శోషయంతి. ఆవ

రణే పత్రాని ప్రసారయేయం వా? త్వం మా ప్రసారయ, తవాంబా ప్రసారయిష్యతి. తర్హి అహం కింకుర్యాం? త్వం తూష్ణీంభవ.

మా పిల్లవాఁ డెక్కడ నున్నాఁడో నేఁటికిని తెలియదు. రేపు తెలియఁగలదు. ఆయూరినుండి రేపు మాతమ్ముఁడు రాఁగలఁడు. నవ్వవద్దురా నీయుపాధ్యాయుఁడు నిన్ను కొట్టును. ఆ ఆఁబోతు నిన్న నాలుగు మారులు మాయింటికి వచ్చినది. చివర కెక్కడికి వెళ్లినదో నాకు తెలియదు. నాకు తెలియును. అది గడమంచె మీఁద నున్న దోసకాయలను క్రిందపడవేసి పరుగెత్తినది. నేతిని కరగింపుము. మమ్మును మోసగించెదవేమి? వంకాయలను సరిగా తూఁచుము. మేము నిన్న శ్రీశైలమును ఎక్కినాము. కొండ మిక్కిలి ఎత్తుగానున్నది. కాని కొండమీఁద చాల చెట్లు లేవు. (నీవు వ్రాసినతర్వాత) = (త్వల్లేఖనానంతరం) మాయింటి కొకమారు రాఁగలవా! మాయింటిని చుట్టుకొని మల్లెతీగ లున్నవి. ఉపాధ్యాయుఁడనఁగా ఎవఁడు! ఆ పిల్లలు మంచినీటి నంతయు చెఱచుచున్నారు. మీ చెల్లెలిదగ్గర పాలు లేదు; అందు వలన చంటిపిల్లవాఁడు చెడిపోవుచున్నాఁడు. వెన్న కరఁగినదో లేదో చూపించుము. బెండచెట్లదగ్గరనున్న మనుష్యుఁ డెవఁడు? వాఁడు దొంగవలె నున్నాఁడయ్యా. నా కెందుకు నే నిక్కడ నుండెను. చెఱువుయొక్క ఒడ్డుమీఁద ఒక ఆఁబోతు అడ్డముగా పరుగెత్తుచున్నది. దానిని చూచి మాఅక్క భయపడినది. నీవు వెళ్ళి దానిని కొంచెము కొట్టఁగలవా?

## త్రిచత్వారింశః పాఠః = నలుబదిమూఁడవ పాఠము

| | | | |
|---|---|---|---|
| ప్రసారణం | = పఱచుట | ధృత్వా | = కట్టుకొని |
| ఆరోపణం | = ఎక్కించుట | ఆలోచ్య | = ఆలోచించి |
| ఆరోహణం | = ఎక్కుట | విచార్య | = విచారించి |
| అవరోహణం | = దిగుట | ఛేదయిత్వా | = కోసి ॥మొ॥ |
| అవరోపణం | = దింపుట | ఆరుహ్య | = ఎక్కి |
| ధరణం | = కట్టుకొనుట ॥మొ॥ | ఆరోప్య | = ఎక్కించి |

తిష్ఠతి = ఉన్నాఁడు, నిల్చున్నాఁడు
స్థాస్యతి = ఉండఁగలఁడు-నిల్వఁగలఁడు
స్థాపయతి = ఉంచుచున్నాఁడు
ఉత్థాపయతి = లేపించుచున్నాఁడు.
ఉదస్థాపయత్ = లేపించెను
స్థాపయిష్యతి = ఉంచఁగలఁడు

బాలకాః వృక్షాన్ ఆరుహ్య ఫలాని పర్ణానిచ ఛేదయన్తి. అద్య భోజనార్థం కేకే ఆగమిష్యంతి వా సమ్యక్ ఆలోచ్య పాకం కారయ, నోచేత్ వ్యర్థః భవిష్యతి. సర్వే మేషాః పర్వతాత్ అవరుహ్య గృహం ఆగచ్ఛంతి. యుష్మాకం బహుళా వ్యాః సాయం కాలే అస్మాకం ద్వారే ఈషత్కాలపర్యంతం స్థిత్వా అనంతరం కుత్రవా అచలత్. తేషాం అవరోహణపర్యంతం త్వం అత్రైవ తిష్ఠ. బత బాలకః వృక్షాత్ అపతదేవ, తం ఉత్థాపయరే. తాత! మాం శనైః మంచ మారోపయిష్యసి కిం! తే బ్రాహ్మణాః కట ప్రసారణానంతరం అంతః ఆగమిష్యంతి. చోష్యే ఈషత్ లవణం

స్థాపయ. తైలపాత్రం ఘృతపాత్రంచ శిక్యే కే అస్థాపయన్? కిం వా మయా నజ్ఞాయతే. మండపే ఏకా లతా లంబతే పశ్య. సా కా లతా? తత్ర వృశ్చికః అస్తి, త్వం గత్వా శీఘ్రం మారయ, నోచేత్ బాలకం దశేత్. నవనీతం ద్రావయిత్వా ఘృతం కురు. అస్మదావరణే వార్తాకాని సంతి చేత్, శాకార్థం ఆనయ. చోప్యే ఊర్వారుకం దార్వికాఫలం చ పాతయత. శ్రీనివాసస్య పుత్రః పాఠార్థం అద్య ఆగమిష్యతి వా న వా విచార్య వద. అనుజాం డోలాయాం కే అశాయయన్.

నిన్న రాత్రి మీయింట్లో నున్నవా రెవరు? మొన్న మీ దొడ్డిలోనికి నాలుగుమాఱ్లు దొంగలు వచ్చినారఁటే. నాలుగు మాఱ్లు కాదుగాని రెండుమాఱులో మూఁడు మాఱులో వచ్చినారు. చాలదా యేమి? ఏమయినను ఎత్తుకొని పోయినారా? మా నాన్నగారి అంగవస్త్రలను దొంగిలించిరి. (పోనీ లే=గచ్ఛతు నామ) ఇంతవఱకు బాగుగనే యుండెను. నేను వచ్చువఱకు నీవిక్కడ నిలువఁగలవా? అలాగే యుందునుగాని, మీరు వెళ్ళిరండు. ఓ నాయనా! మీ అమ్మను పిలువుము. బొత్తుగా రామాయణమును చదువవేమిరా—చదువుచున్నాను నాయనా! నేను చదువలేదని ఎవరు చెప్పినారు? ఎవఁడు చెప్పిననేమి గాని నీవు పుస్తకమును చూచుచున్నావురా. చూచుట లేదుగాని చదువుచున్నానని చెప్పితినిగా. బాగుగనే యున్నది. చూచుచున్నాఁడు కాఁడట చదువుచున్నాఁడఁట. పోనీ నాయనా! తమ్ముని అడుగుము. అలాగే అడుగుదునుగాని తమ్ముని పిలు

వ్రుము. పిలిచినాను. ఏమిరా పిల్లవాఁడా! అన్నయ్య ఇవ్వేళ ప్రొద్దున మొదలుకొని యేమిచేయుచున్నాఁడురా? నిజముగా చెప్పుము. అన్నయ్య నడిగి చెప్పుమనా నాయనా! అన్నయ్యను అడుగవద్దు నీవే చెప్పుము. అన్నయ్య మనవాళ్లో గడ్డపారతో త్రవ్వుచున్నాఁడయ్యా.

చతుశ్చత్వారింశః పాఠః = నలుబదినాల్గవ పాఠము.

| | |
|---|---|
| ఆలోచనం = ఆలోచించు | ఉత్థాయ = లేచి |
| విచారణం = విచారించుట | ఉత్థాప్య = లేపించి |
| ఉత్థానం = లేచుట | యథేష్టం = ఇష్టమువచ్చినట్లు |
| ఉత్థాపనం = లేపించుట | యత్రకుత్రవా = ఎక్కడనో [ఒకచోట |
| మాతులః = మేనమామ | పురుషమాత్రం = నిలువెడు |
| పంకః = బురద | ఉత్థాతుం = లేవఁ - లేచుటకు |
| ఉత్తిష్ఠతి = లేచుచున్నాఁడు | అవరోహతి = దిగుచున్నాఁడు |
| ఉత్థాస్యతి = లేవఁగలఁడు | అవరోపయతి = దింపుచున్నాఁడు |
| ఉదతిష్ఠత్ = లేచెను | అవరోక్ష్యతి = దిగఁగలఁడు. |

భో మాతుల! బాలకాః సర్వేఽపి మంచేభ్యః ఉదతిష్ఠన్. తాన్ సర్వాన్ అంతః ఆనీయ భోజనం కారయిత్వా అనంతరం రామాయణం పఠత. కిమర్థం రే ఏకవారం ఘంటాం నాదయ (తే ఏవ) = తేఏవ ఆగత్య స్వస్వకార్యాణి కుర్యుః. ఏషః స్తనపః తతః ఉత్థాతుం నాలం, త్వం గత్వా తముత్థాప్య క్షీరం పాయయ, క్షీరం కిమర్థం, ఈష దన్న మేవ ఖాదయిష్యామి; అన్నప్రాశనం

అభవత్ఖలు! తత్ర యూయం సర్వే కిమాలోచయథ. నకిమపి; రామాయ కన్యాం దాతుం కేవా ఆగచ్ఛన్; తం సమాచారం విచారయామః. విచారణానంతరం మద్గృహం ఆగత్య తం వృత్తాంతం మాంప్రతి వదిష్యథ కిం? తత్రైవ వదిష్యామః. రామస్య ఉద్యోగః నాస్తి, మాన్యం ఈషదపి నాస్తి కింతు, బాలకః యోగ్యః, శాంతః, సుందరః, పాఠశాలాయాం చతుర్థకక్ష్యాం పఠతి. అరే సంస్కృతభాషామపి పఠతి కిం? తస్య జనకః సంస్కృతవిద్యాం పురాణవిద్యాంచ శిక్షయతి. కథం పాఠయతిరే, తస్య ధనం నాస్తిఖలు. చేత్ కిం; భిక్షాటనం కృత్వా భాషాద్వయం పాఠయతి. బాఢం వివాహనిశ్చయః అభవత్కిం? నాభవత్. కుతః? ఏతావత్పర్యంతం నాభవత్, శ్వః కిం భవిష్యతివా. మమ మంచే బాలకాః పతిత్వా దౌష్ట్యం కుర్వంతి, తం మంచం యత్రకుత్ర వా స్థాపయిత్వా తాళ దండయ. అస్మద్వస్త్రం పంకే అపతత్, సమ్యగ్ధావత.

మా బాణలిని ఎవరో బావిలో పడవేసినారు. మీ బావిలో ఎంతనీరున్నది? అబ్బో నిలువెడునీరున్నది. నీవు బావిలో దిగఁగలవా? నేను దిగఁజాలను. మీ ఆలోచనమయినతరువాత నేను పిల్చుచున్నానని మా అబ్బాయిని పిలువుఁడు. మీ యింట్లో చాలదోమ లున్నవండీ. ఈ పిల్లవానిని గుఱ్ఱముపైన నెక్కించి అలా తీసికొనివెళ్ళుము, లేకపోతే వీఁడిక్కడ అల్లరి చేయుఁగలఁడు. మంచముమీద దిండున్నదా లేదా? అరే ఆఁబోతు ఇష్టమువచ్చినట్లు మనుష్యులను తఱుముచున్నదిగాని రోకటితో

దానిని కొట్టుము. అయ్యో చూచితివా ఆ అంబోతు బుడిలో పడినది. అయితే కొట్టవద్దు. పిల్లవానిని తొట్ల నెక్కించుము. ఉట్టిమీదనుండి నేతిగిన్నెను దింపుము. వంట అంతయును అయినది. ఇకమీద ఆలస్యము లేదు. అక్కడనున్న అందరిని భోజనముకొఱకు పిలిచి నీవుకూడ స్నానముకొఱకు చెఱువునకు పొమ్ము. త్వరగా లేచి పోరా ఎందుకు జాగుచేయుదువు? నీవు లేచిన తరువాత నేనుకూడ స్నానముకొఱకు లేవఁగలను. నీ నాల్గవతమ్ముఁడు బడికి పోవుట లేదటే? ఇప్పుడే చదువు అయినదా? నే (నెన్నిమార్లు) = (కతికృత్వః) చెప్పుదును? ఎక్కడెక్కడికో వెళ్ళఁగలఁడు, ఏమేమో చేయఁగలఁడు, (వానియిష్టమే యిష్టము) (తస్య ఇష్టమే వేష్టం) నే నేమి చేయఁజాలుదును? నా కెందుకు, మీ కెందుకు?

పంచచత్వారింశః పాఠః = నలుబదియైదవ పాఠము

| | | | |
|---|---|---|---|
| ప్రవేశః = ప్రవేశించుట | | ధృత్వా | = ధరించి |
| ప్రవేశనం = ప్రవేశపెట్టుట | | ధర్తుం | = ధరించుటకు |
| దానం = ఇచ్చుట | | దాతుం | = ఇచ్చుటకు |
| దాపనం = ఇప్పించుట | | ప్రవిశ్య | = ప్రవేశించి |
| సామర్థ్యం = శక్తి | | ప్రవేశ్య | = ప్రవేశపెట్టి |
| తండులాః = బియ్యము | | యథాకథంవా | = ఎటులనో (ఒకటుల |
| పేటికా = పెట్టె | | | |

ప్రవిశతి = ప్రవేశించుచున్నాఁడు
ప్రావిశత్ = ప్రవేశించినాఁడు

ప్రవేక్ష్యతి = ప్రవేశింపఁగలఁడు
ప్రవేశయతి = ప్రవేశపెట్టుచున్నాఁడు
ప్రావేశయత్ = ప్రవేశపెట్టినాఁడు
ప్రవేశయిష్యతి = ప్రవేశపెట్టఁగలఁడు

రామస్య వివాహః ఆసీత్ఖలు, గృహప్రవేశః కదా అభవత్? ఇదానీమపి నాభవత్. శ్వోవా పరశ్వోవా భవిష్యతి. రామస్య వివాహార్థం గమనసమయే ఏకః మార్జాలః అభిముఖం ఆగచ్ఛత్. కన్యాదానం కః అకరోత్? శ్రీనివాసః గ్రామే నాస్తిఖలు? మమానుజః అకారయత్. మమ ఉత్థాతుమపి సామర్థ్యం నాస్తి. త్వం శుభ్రవస్త్రం ధృత్వా దేవతార్చనం కుర్యాః కిం? తథైవ కరిష్యామి. యుష్మద్దేవపేటికాయాం విగ్రహాః న సంతి ఖలు? దేవపూజాం కథం కుర్యాం? ఏకం విగ్రహం పేటికాయాం ప్రవేశయ ప్రథమం, అనంతరం ఘంటాం నాదయ. తథైవ. భో ఆచార్య! దేవపేటికాయాం ఇతః పూర్వమేవ ఏకః విగ్రహః అస్తి పశ్య. అరే ఏతత్కింరే మూషకః కథం ప్రావిశద్ దేవపేటికాయాం? కేన జ్ఞాయతే. ఏకః బ్రాహ్మణః ద్వారే తిష్ఠతి, తం యథాకథంవా అంతః ప్రవేశ్య తం పృచ్ఛ, తస్య సమీపే దేవపేటికా అస్తి కింవా. దేవతార్చనేన కిం ప్రయోజనం, ప్రథమం గృహే తండులా ఏవ నసంతి. బ్రాహ్మణశ్చ ఆగత్య కిం కరిష్యతి? హ్యః రాజమహేంద్రపురే దశ తస్కరాః ఏకస్య బ్రాహ్మణస్య గృహే ప్రవిశ్య, సర్వం ధనం అచోరయన్ – ఇతి ఆంధ్రపత్రి

కాయాం ఆలిఖ. పాకపాత్రాణి ప్రథమం చుక్రేణ ధావి త్వా పశ్చాత్ గోమయేన శోధయ. తవ అంబా స్నానార్థం అగచ్ఛత్, ఏతావత్పర్యంతం స్నానం కృత్వా స్యాత్, సా పాకగృహే ప్రవేక్ష్యతి, పాత్రాణి సర్వాణి ఆనీయ అత్ర స్థాపయ. త్వం తూష్ణీం తిష్ఠ, అహం సర్వం కరిష్యామి.

నా చెంబు బురదలో పడినదిగాని, కొంచెము కడుగుమా నాయనా! ఎందుకు పడినది మామా! నీ చెంబు? నేను వెలుపలికి వెళ్ళినాను, అక్కడ నన్నొక పంది తరిమినది, అందువల్ల నే నాపందిని చెంబుతో కొట్టినాను. పంది పారిపోయినది, చెంబు బురదలో పడినది. నిన్న మీ ఉపాధ్యాయుఁడు గ్రామాంతరము నుండి వచ్చినాఁడుగదా, ఆయనను ఎక్కడ ప్రవేశపెట్టినావు? నిన్న సందెవఱకును సత్రములోనే ఉండెను, ఇవ్వేళ మా యింట్లో ప్రవేశపెట్టుదును. మొదట సత్రములో నెవరు ప్రవేశపెట్టిరి? ఆయనే ప్రవేశించినాఁడు. ఆయన గుఱ్ఱముమీఁద వచ్చినాడా (లేక) (నోచేత్) ఊరకయే వచ్చినాడా? మొదట గుఱ్ఱము నెక్కి కొంత దూరము వచ్చినాడట, అప్పుడు సంధ్యాకాల మయినదట, ఇంతలో గుఱ్ఱమును అక్కడ నొక చెట్టుదగ్గర నుంచి చెరువునకు సంధ్యావందనానికి వెళ్ళినాడట, అప్పుడా గుఱ్ఱము దేవుని పెట్టెను క్రిందపడవేసి పాఱిపోయినదని ఆయన నాకు చెప్పినాడు. అది యెంతవరకు నిజమో నాకు తెలియదు. అది ముంగియా యెలుకా లేక పందికొక్కా కొంచెము చూడు. చూచినానండోయి

అది ఏదియు కాదు; కుక్క! కుక్క! అయ్యో దేవునింట్లోనికి కుక్క యెట్లు చొరబడ్డదిరా? అది చొరఁబడలేదు. మీశిష్యుఁడు తెచ్చినాఁడట. వానికేమివచ్చినదిరా నాయనా. ఏమోపోనిమ్ము.

షట్చత్వారింశః పాఠః = నలుబదియాఱవ పాఠము

ఆపణః = అంగడి
గుడం = బెల్లము
పదార్థః = వస్తువు
జీరకః = జీలకఱ్ఱ
మాషాః = మినుములు
అపూపః = అప్పము
సమర్థః = చాలినవాఁడు
ఉపవిశ్య = కూర్చుండి
ఉపవేశ్య = కూర్చుండఁబెట్టి
యావజ్జీవం = బ్రతికినంతవరకు
ఉపవేష్టుం = కూర్చుండుటకు
ఉపవేశయితుం = కూర్చుండఁబెట్టుటకు
యథావిధి = లోపము లేకుండ.

ఉపవిశతి = కూర్చుండుచున్నాఁడు
ఉపవేక్ష్యతి = కూర్చుండఁగలఁడు
ఉపావిశత్ = కూర్చుండెను
ఉపవేశయతి = కూర్చుండఁబెట్టుచున్నాఁడు
ఉపవేశయిష్యతి = కూర్చుండఁబెట్టఁగలఁడు
ఉపావేశయత్ = కూర్చుండఁబెట్టెను
శోధయతి = శుద్ధిచేయుచున్నాఁడు

ఆపణం గత్వా సర్వాన్ పదార్థాన్ ఏకవారమే వానయ, పునఃపునరాగచ్ఛ. తతః ఉపవిశ్య సంధ్యావందనం కరోతి కః, త్వయాజ్ఞాయతే కిం? సః బాలకః తటాకతటే తూష్ణీం

ధావతి, తం ఆనీయ గృహే ఏకత్ర ఉపవేశయితుం త్వం ఏకః ఏవ సమర్థః; నాన్యః. యావజ్జీవం అస్మన్నంగేషు మత్కుణాః వసంతి ఏవ. శిష్యాః సర్వేపి ప్రత్యహం సంధ్యావందనం యథావిధి కుర్వంత్యేవ. త్వమేక ఏవ సమ్యక్ న కరోషి. మాషాన్ అనేష్యామి కింతు, త్వదంబయా అపూపాన్ కారయిష్యసి కిం? క్షీరే ఈషద్గుడం పాతయేః చేత్, మధురం భవేత్. సః మర్కటః అత్రాగత్య అస్మద్ద్వారే ఉపవేష్టుం స్థలం పశ్యతి. యూయం అత్ర ఉపవిశత, ఏకం సమాచారం వదిష్యామి. కిం సమాచారః ఇతి చేత్, సర్వే బ్రాహ్మణాః దేవాలయే ఉపావిశన్. ఏకః హరిదాసః చెన్నపట్టనాత్ ఆగత్య తత్ర హరికథాం కథయతి కిల, తద్ద్రష్టుం బహుజనాః ఆగచ్ఛన్. అరే త్వం గత్వా ఏకైకం సమ్యక్ ఉపవేశయ. భో బ్రాహ్మణాః! శీఘ్ర మత్ర ఉపవిశత. అత్ర కటాః న సంతి; కథం ఉపవిశేమ? అధః సర్వత్ర స్థలం సమ్యక్ నాస్తి. ప్రథమతః స్థలం శోధయిత్వా తదుపరి కటాన్ ప్రసారయత, తేషు వయం ఉపవిశామః. నృపః ఆగత్య సర్వాన్ ఉపవేశయిష్యతి; తావత్పర్యంతం బహిః తిష్ఠామ; ఉత్తిష్ఠత. అరే అస్మాన్ కః ఉపవేశయిష్యతి రే; వయమేవ అనుకూలస్థలే ఉపవేక్ష్యామః. నృపః బహుజనాన్ ఉపావేశయత్. అరే పశ్య హరిదాసః సమ్యక్ హాసయిష్యతి రే.

నే నొకనాఁడు మార్కాపురగ్రామమునందు ఒక సత్రములో ప్రవేశించితిని. అక్కడ నొక బ్రాహ్మణబాలుఁడు నన్ను చూచుటకు వచ్చెను. వానికి ఉపనయనము అయినది. కంఠమునందు యజ్ఞోపవీతము వ్రేలాడుచున్నది. ఆపిల్లవాఁడు బహు

దొంగవానివలె నుండెను. అతఁడు నాకు నమస్కారమును చేసి అయ్యా! మీ యూరేది అని నన్నడిగెను. అరే అబ్బాయీ! మా యూరిపేరు నీకెందుకని నేను వానిని అడిగితిని. 'ఎందుకును లేదు; మీరు పండితులువలె నున్నారు గాన నేను మీ దగ్గర విద్యను చదువుకొనుటకు వచ్చినాను; మీరు నాకు సంస్కృతమును నేర్పుదురా' అని నన్ను అడిగెను. వానియొక్క (మాటలు = వచనాని), నన్ను మిక్కిలి సంతోషపెట్టినవి. పిమ్మట నేను 'నాయనా నీవు మొదట ఆంధ్రభాషను చదివినావా' అని అడిగితిని. 'మాతండ్రి నన్ను ఆంధ్రభాషను బాగుగనే చదివించినాడు – మీరు నాకు సంస్కృతభాషను నేర్పుఁడు' అని చెప్పెను. 'సరేకాని నీవు ఆంధ్రభాషను చదివినయెడల ఏమేమి పుస్తకములు చదివినా'వని అడిగితిని. 'నేను ఆంధ్రభారతమును భాగవతమును మనుచరిత్రను వసుచరిత్రను ఇంకను చాల గ్రంథములను చదివితి'నని చెప్పి కొన్ని పద్యములను చదివెను.

## సప్తచత్వారింశః పాఠః = నలువదియేడవ పాఠము

స్థలం = చోటు

సమాచారః, వృత్తాంతః = సంగతి

హరిదాసః = హరిదాసుఁడు

కథా = కత

శోధనం = శుద్ధిచేయుట

కథనం = చెప్పుట

ప్రథమతః = ముందుగా, మొదటి [నుండి

శోధయిత్వా = శుద్ధిచేసి

శోధయితుం = శుద్ధిచేయుటకు

కథయిత్వా = చెప్పి

జ్ఞాత్వా = తెలిసికొని

జ్ఞాపయిత్వా = తెలిపి

కథయతి = చెప్పుచున్నాఁడు

ఆజ్ఞాపయతి = ఆజ్ఞాపించుచున్నాఁడు
విజ్ఞాపయతి = మనవిచేసికొనుచున్నాఁడు
వ్యజ్ఞాపయత్ = మనవిచేసికొనెను
ఆజ్ఞాప్య = ఆజ్ఞాపించి    విజ్ఞాప్య=మనవిచేసికొని

హంజే! ఝటితి స్థలం శోధయ. అహం స్నానం కృత్వా ఇదానీమేవ ఆగమిష్యామి. యూయం సర్వే శీఘ్రం భోజనం కురుత. అద్య నక్తం అస్మద్గృహే హరికథా భవిష్యతి. ఏతద్వృత్తాంతం రామాయ కః అకథయత్? సః ఏవ హరిదాసమీపం ప్రాతర్గత్వా సర్వం సమాచారం జ్ఞాత్వా ఆగచ్ఛత్. దాసస్య కథాకథనే అతీవ సామర్థ్యం అస్తి భోః. కథాకథనానంతరం సః క్షీరం పాస్యతి. అస్తి వా న వా క్షీరం గృహే? నో చేత్, అస్మచ్ఛిష్యం క్షీరమానేతుం ఆజ్ఞాపయ. బహుజనాః ఆగమిష్యంతి. అస్మాకం గృహే స్థలం నాలం కింవా పార్శ్వే వాసుదేవాచార్యస్య గృహం అస్తి ఖలు. కుడ్యే ద్వారం కృత్వా తత్రాపి కటాన్ ప్రసార్య జనానుపవేశయిష్యామః. యథా కథంవా భవతు, హరికథా కింవా భవిష్యత్యేవ. అరే సుబ్రహ్మణ్య! నృపసమీపం గత్వా-'భో నృప! అస్మదుపాధ్యాయగృహే అద్యనక్తం హరికథా భవిష్యతి; యూయమపి ఆగచ్ఛత' ఇతి విజ్ఞాప్య ఆగమిష్యసి కిం? నృపగృహద్వారే ఏకః శునకః అస్తి. సః మదుపరి పతేత్ కింవా, అహం న గమిష్యామి. మాస్తు మాస్తు. సీతారామః ప్రాతరేవ నృపసమీపం గత్వా

సర్వవృత్తాంతం వ్యజ్ఞాపయత్. అస్మద్గ్రామం పరితః గోదా ఽస్తి. తతః అస్మాకం స్నానార్థం ఆనుకూల్య మస్తి. సత్యమ్.

మీ రీవేళ సాయంకాలమువరకు మాయింట్లో నుండ వలయును. రేపుప్రొద్దున మొదలుకొని దేవునికి పెండ్లి కాఁగలదు. నీ వెందుకు భయపడుచున్నావు? మా అక్కయ్యను మేనమామయింటికిఁ దీసికొని వెళ్ళుటకు ఎవరును లేరు. ఏట్లగునో అని భయపడుచున్నాను. లేకపోయిన నేమి నీవే తీసికొనివెళ్ళుము. పిల్లలందఱు నెక్కడ కూర్చుండి భోజనమును చేయుచున్నారు? ఇంట్లో బియ్యము లేవుగాని, అంగడికి వెళ్ళి తీసికొఁరమ్ము. జీలకఱ్ఱకూడ లేదఁట తెత్తునా? నన్నడిగెద వేమి? మీఅమ్మ తెమ్మనినయెడల తెమ్ము. మాఅమ్మ యిక్కడ లేదు. శేషాచార్యులగారియింట్లో కూర్చున్నది. అక్కడ నేమి చేయుచున్నది? అక్కడ అప్పములను చేయుచున్నది. మనయింట్లో మినుము లున్నవా యేమి? నిన్న నేను తెచ్చితినిగా. అంగడిలో బెల్లము నెట్లిచ్చుచున్నారు? ఏమో నే నడుగలేదు. రేపు కనుఁగొనెదను-విచారింతును. మొన్న నీ కెదురుగా నెవరో మీయింట్లో కూర్చున్నారే వా రెవరు? నాభార్యయొక్క మేనమామలు. వారి దేయూరు? ఇక్కడే తెనాలి. తెనాలిలో పాఠశాల సాగుచున్నదా? చక్కగనే సాగుచున్నది. పాఠశాలలో నెందరు పిల్లలున్నారు? చాలమంది పిల్లలున్నారు. అందఱును బ్రాహ్మణులేనా, ఇతరులుకూడ నున్నారా? ఇతరులు చాల మంది లేరు. ఆలాగా!

## అష్టాచత్వారింశః పాఠః = నలుపదియెనిమిదవ పాఠము

అవకాశః = వీలు
ఆజ్ఞాపనం = ఆజ్ఞాపించుట
విజ్ఞాపనం = మనవిచేయుట
సమావేశః = చేరుట
సమావేశనం = చేర్చుట
హస్తః = చేయి
ఆజ్ఞాప్య = ఆజ్ఞాపించి
విజ్ఞాప్య = మనవిచేసి
సమావిశ్య = చేరి
సమావేశ్య = చేర్చి
సమావేష్టుం = చేరుటకు
సమావేశయితుం = చేర్చుటకు
రూఢ్వా = మొలిచి
సమావిశతి = చేరుచున్నాడు
సమావేక్ష్యతి = చేరగలడు
సమావేశయతి = చేర్చుచున్నాడు
సమావేశయిష్యతి = చేర్చగలడు
సమావిశత్ = చేరెను
సమావేశయత్ = చేర్చెను
రోహతి = మొలుచుచున్నది.

యుష్మద్గృహే ఉపవేష్టుం మమ ఈషదపి అవకాశః నాస్తి–కుతఇతిచేత్, అస్మద్గృహే మమానుజస్య వివాహః భవతి. తదర్థం అహం ప్రతిగృహం గత్వా సర్వాన్ బాంధవాన్ భోజనార్థం ఆహ్వయేయం ; యూయమ ప్యాగచ్ఛత. శీఘ్రమేవ భవిష్యతి కిం? తథై వాగమిష్యామి. సర్వసమావేశానంతరం పునర ప్యేకవారం మాం ఆహ్వాస్యసి కిం? తవహస్తే కిమస్తి దర్శయ. కిమపి నాస్తి–పాకం కర్తుం కాన్ ఆజ్ఞాపయసి? బహు జనాః సంతి. గ్రామాంతరేషు స్థితాః యుష్మద్బాంధవాః సర్వే సమావిశన్ కిం? సమావిశ్య దినచతుష్టయం ఆసీత్. సర్వాన్

సమావేశయితుం త్వమేవ సమర్థః. అస్మదావరణే తులసీవృక్షః నాస్తి కే, కతికృత్వః అపి సరోపాతి. దేవపూజార్థం తులసీదళాని నయంతి. ప్రతిదినం కస్య గృహం గచ్ఛేయం? అస్మద్గృహే అనేక వృక్షాః సంతి. ఏకం మానీయ పునరపి రోపయిష్యామి, శ్వః దాస్యసి కిం? శ్వః శుక్రవాసరః; పరశ్వః ఆగచ్ఛ. ఆగమనసమయే ఏకం ఖనిత్రమప్యానయ. శాకాని ఛేదయత, ఆలస్యం మాభవతు. ఇదానీమేవ దశఘంటాః అభవన్. ముహూర్తకాలః సమీపమాగచ్ఛతి–తాత! మార్జారః యథా అభిముఖం నాగచ్ఛతి తథా జాగ్రత్తయా తిష్ఠ. పురోహితాః కిం కుర్వంతి? స్నానం కృత్వా వస్త్రాణి శోషయంతి; తాన్ శీఘ్రమానయ.

నాకేమియును తెలియదు, ఎవరెవరిని పిల్చుకొందునో మీరే వెళ్లి పిలువుఁడు. మీ మేనమామకు ఉత్తరము వ్రాసినావా? ఇంకను చేరలేదేమి? ఆయన రేపు ప్రొద్దున మనయింటికి చేరఁగలఁడు. నీవు కొంచెము నాతోకూడ అంగడికి వచ్చెదవా? సరే వత్తును పదండి. చాలమంది భోజనమునకు వత్తురేమో కదా, వారినందరిని ఎక్కడ కూర్చుండఁబెట్టఁగలవు? మీ కెందుకండి. అంతయు మీకేనా? నేనెక్కడనో ఒకచోట కూర్చుండఁబెట్టఁగలను. మీ రూరకుండుఁడు. చంటిపిల్లవాండ్రు రస్తాయందున్నారు లోపలికి తీసికొనిరమ్ము. పాలుత్రాగించుము. మంగళసూత్రమును తీసికొనివచ్చుటకు మీ యమ్మతోకూడ నెవరెవరు వెళ్ళినారు? మా అక్కయ్య, చెల్లెలు, రామాచార్యులగారి పెండ్లము వెళ్ళినారు. నీవు కొంచెమునే యిక్కడ నుండి అందరిని అక్కడక్కడ కూర్చుండఁబెట్టుము. చూడు చూడు పిల్ల

వాండ్రు బెల్లమును తెచ్చుకొని యెట్లుతినుచున్నారో! వాండ్రను కొంచెము బెదరింపుము. ఆమె యెవనిభార్యయో నీకు తెలియునా? మా గురువుగారిభార్య; లోనికి ప్రవేశపెట్టి మీ అమ్మతో చెప్పుము. ఓ ఆచార్యులుగారూ! ఒకమనవి ఉన్నదిగాని యిట్లురండు. (ఇదుగో=ఏషోస్మి) వచ్చినాను చెప్పుడు. ముహూర్తకాల మెన్నిగంటల తరువాత? రాత్రియెనిమిదిగంటలకు పైన. అయితే సరే, ఇంకను చాల అవకాశ మున్నది.

### ఏకోనపంచాశః పాఠః=నలువదితొమ్మిదవ పాఠము

| స్త్రీలింగము = తత్ శబ్దము | | | స్త్రీలింగము = ఏతత్ శబ్దము | |
|---|---|---|---|---|
| | సా = ఆమె | | ఏషా = ఈమె | |
| | ఏ. | బ. | ఏ. | బ. |
| ప్ర. | సా | - తాః | ఏషా | - ఏతాః |
| ద్వి. | తాం | - తాః | ఏతాం | - ఏతాః |
| తృ. | తయా | - తాభిః | ఏతయా | - ఏతాభిః |
| చ. | తస్యై | - తాభ్యః | ఏతస్యై | - ఏతాభ్యః |
| పం. | తస్యాః | - తాభ్యః | ఏతస్యాః | - ఏతాభ్యః |
| ష. | తస్యాః | - తాసాం | ఏతస్యాః | - ఏతాసాం |
| స. | తస్యాం | - తాసు | ఏతస్యాం | - ఏతాసు |

ఇటులే:- సర్వా-అన్యా-యా-కా-స్వా-ఏకాశబ్దములును. ఏకాశబ్దమునకు ఏకవచనమే కాని బహువచనము లేదు.

| | | | |
|---|---|---|---|
| జాగ్రత్తా | = జాగ్రత్త | మధురః | = తీయనిది |
| పురోహితః | = పురోహితుఁడు | అమ్లః | = పుల్లనిది |
| క్రమేణ | = వరుసగా | తిక్తః | = చేదు |

ఆగామి = రాఁబోవు  గతః = కడచిన లేక వెళ్లిన
రమణీయః = చక్కనివాఁడు  క్రమశః = వరుసగా (వాఁడు

| | ఆశీరాద్యర్థకము | | విధ్యర్థకము | |
|---|---|---|---|---|
| | ఏ. | బ. | ఏ. | బ. |
| ప్ర. | లంబతాం | లంబంతాం | లంబేత | లంబేరన్ |
| మ. | లంబస్వ | లంబధ్వం | లంబేథాః | లంబేధ్వం |
| ఉ. | లంబై | లంబామహై | లంబేయ | లంబేమహి |

గతదినే నక్తం శివాలయే చోరాః ప్రవిశ్య దేవస్య ఆభరణాని సర్వాణి అపి అచోరయన్ కిల. తతః త్వం ప్రతిదినం నక్తం జాగ్రత్తయా వస. తస్యాః పుత్రాః రాజమహేంద్రవరే హూణవిద్యాం పఠంతి. తదర్థం సా ఏతత్ గ్రామాత్ ఉత్థాయ పుత్రసమీపే ఏవ వసతి. చోరాణాం చోరయితుం అస్మద్గృహే కిం ధనమస్తి? యుష్మాకం గృహేషు నకులాః సంతి రే. ఇతః పూర్వం నకులః వా మూషకః వా అస్మద్గృహే ఏకోఽపి నాసీత్; ఇదానీం క్రమేణ యుష్మద్ గృహాత్ ప్రవిశంతి. తత్రం ఆమ్రం అస్తి. సః బాలకః అతీవ రమణీయః. ఏషా కన్యా పుత్రికా వా మయా నక్షాయతే. యుష్మత్కూపే జలం మధురం అస్తి. నాగదంతం హస్తేన ధృత్వా లంబస్వ. ఆగామిసోమవాసరే మమ కుమారస్య ఉపనయనం భవిష్యతి; పురోహితః ముహూర్తం అస్థాపయత్. ఏతత్ ఫలాని తిక్తాని సంతి, మాఖాద. ఏషా మమ అంబా. సా అన్యా. తవ భార్యా కుత్రాసీత్? మాతులగృహే వివాహార్థం అగచ్ఛత్. పునః కదా ఆగమిష్యతి? దశదినేభ్యః ఆగమిష్యతి, వయం సర్వే

శ్వః ప్రాతః కృష్ణాస్నానార్థం గమిష్యామః; యూయమపి అస్మాభిస్సాకం ఆగమిష్యథ కిం? అస్మాకం ఆగంతుం అవకాశః నాస్తి, యూయం గచ్ఛత. శ్వః పరశ్వశ్చ గృహే కించి త్కార్య మస్తి. తథాచేత్ మాస్తు.

ఇందాక ఆలా వెళ్ళిన పిల్లవాఁ డెవఁడు? నిన్న నొక కుక్క మేకలను తఱిమినది. ఆకుక్కను నేను రోకటితో కొట్టినానుగాని, కుక్క పాఱిపోయినది. తరువాత బూమామ గారియింట్లోనున్న ఒక యెద్దును కఱచి చివర కాకుక్క క్రమముగా తినచోటునకు వచ్చెను. రేపు మీ రందఱును రామయ్యయింట్లో చేరుదురుగదా! అప్పుడు నన్నుకూడ పిలువుఁడు, నేనుకూడ వత్తును. వాఁడు నాకు బాకీ యున్నాఁడు. దోసకాయలు అన్నియు చేదు అయినవిరా; ఎవఁ డిచ్చినాఁడు నీకు? మీఅమ్మయొక్క చీరెను చెట్టుమీద వ్రేలాడవేసినావా లేదా? ఇందాకనే వ్రేలాడవేసినాను. చాలుచాలు ఇక ఊరకుండుము. గడచినరోజున మీ ఉపాధ్యాయుఁడు ఎందుకో నన్ను రమ్మన్నాఁడు. నేను వెళ్ళలేదు. నీవు ఇవ్వేళ వెళ్ళి విచారించి నాతో చెప్పుము. రాబోవు శని వారమునందు గర్తపురమునందు దేవాలయములో ఉత్సవము కాఁగలదు; మే మందఱము అక్కడకు వెళ్ళుదుము. కొందఱు బ్రాహ్మణులు ఎవరో వాకిటిలో నున్నారుగాని, వారిని లోపల ప్రవేశపెట్టుము. మీ ఆవుయొక్క పాలు తియ్యనిదేనా? ఆ తియ్యనిదే. హోహో. ని న్నెవరు పిల్చినారు? మా ఆవిడ యింటిలో ఉన్నదేమో చూడుము.

## పంచాశః పాఠః = ఏబదవపాఠము

| | |
|---|---|
| సముద్రః = సముద్రుఁడు | మూఢః = తెలివితక్కువవాఁడు |
| చంద్రః = చంద్రుఁడు | వర్షతి = కురియుచున్నాఁడు |
| సూర్యః = సూర్యుఁడు | ప్రకాశతే = ప్రకాశించుచున్నాఁడు |
| మేఘః = మబ్బు | |
| పాషాణః = రాయి | పరివేషయతి = వడ్డించుచున్నాఁడు |
| దధి = పెరుగు | |
| ఆకాశః = ఆకాశము | పర్యవేషయత్ = వడ్డించినాఁడు |
| సమీచీనః = మంచిది | |
| దుష్టః = చెడ్డది | ప్రాకాశత = ప్రకాశించెను |
| దుర్మార్గః = దుర్మార్గుఁడు | ప్రకాశిష్యతే = ప్రకాశింపఁగలఁడు |
| బలిష్ఠః = బలముగలవాఁడు | |
| దుర్బలః = బలహీనుఁడు | పరివేషయిష్యతి = వడ్డించఁగలఁడు |
| మూర్ఖః = మూర్ఖుఁడు | |

ప్రతిదినం దివా ఆకాశే సూర్యః ప్రకాశతే. నక్తం చంద్రః ప్రకాశతే. మేఘాః సమ్యక్ అవర్షన్. సముద్రే జలం సర్వం అపి లవణం. బ్రాహ్మణేభ్యః దధి పర్యవేషయత. తవ పుత్రః అతీవ దుష్టః, యుష్మదనుజః యోగ్యః. సమీచీనం ఏకం ఉర్వారుక ఫలం ఇష్టం ఆనయ రే; ఛేదయిత్వా ఖాదామ. ఛురికా నాస్తి గృహే, కథం ఛేదయిష్యసి? దంతైః ఏవ దష్ట్వా ఖాదామ. నో చేత్ తూష్ణీం స్థాస్యామః కిం? హ్యః సాయం సమయే చోరాః ఆగత్య అస్మాకం సర్వేషాం గృహేషు

పాషాణాన్ అపాతయన్. తదా కతిచిత్ మనుష్యాః తాన్
చోరాన్ (అన్వధావన్ = వెంటఁబరుగెత్తిరి) కింతు తే చోరాః
మనుష్యాన్ త్రాసయిత్వా పాషాణైః అతాడయన్. తే
మనుష్యాస్తత్ర స్థిత్వా పునఃస్వగృహాణి అధావన్. ఏకదా ఏకః
బలిష్ఠః వృషభః అస్మదావరణే పతిత్వా సర్వాన్ దార్వికా
వృక్షాన్ ఉర్వారుకవృక్షాంశ్చ అఖాదత్. అరే మూఢ!
ప్రథమం రామాయణం పఠిత్వా అనంతరం భారతం పఠ రే.
ఛీ! ఖర! దూరం గచ్ఛ తవ జనకః ఆగచ్ఛతి ఆగచ్ఛతి. శీఘ్రం
వృక్షాత్ అవరోహ, సః ద్రక్ష్యతి చేత్ తాడయిష్యతి. మా ధావ,
మా ధావ; శనైః ఆగచ్ఛ; నో చేత్ అధః పతేః. హ్యః మధ్యాహ్నే
సూర్యః సమ్యక్ప్రాకాశత; అద్య ఆకాశే మేఘాః సంతి ఖలు
తదర్థం సమ్యక్ న ప్రకాశతే. సర్వేషు పర్ణేషు శాకం పర్యవేష
యన్ కిం, దృష్ట్వా ఆగచ్ఛ. ఆకాశే మేఘాః ధావంతి, భోజన
సమయే వర్షేయుః కింవా కేన జ్ఞాయతే! దేవేన జ్ఞాయతే.
వర్షేయుశ్చేత్, కిం కరిష్యామః.

అరే దుర్మార్గుఁడా! అల్లరి చేయుచున్నావా? లేచి
పొమ్ము. ఒక తెలివితక్కువ పిల్లి ఒక యెలుకను చంపి తన
దగ్గర క్రింద ఉంచుకొని కూర్చుండెను. అప్పుడు ఒకనక్క
ఆ పిల్లిని చూచి 'ఓ పిల్లీ! యెందుకు విచారించుచున్నావు' అని
అడిగెను. తరువాత ఆ పిల్లి నక్కను చూచి ఈనక్క నన్ను
మోసపుచ్చుటకు వచ్చినది. ఇది మిక్కిలి చెడ్డది, అని తెలిసి
కొని ఆయెలుకను ఇంకొక చోటికి తీసికొని పోయెను.
ఓ మామా! ఆ యెలుకను నీవు తినవలదు, అది చాల చెడ్డది;

నిన్న దానియొక్క పండ్లను నేను చూచినాను. అది నన్ను కఱచినది. సిలుసిలు ఎక్కడికి పోవుచున్నావు? దానిని నీవు తిన్నయెడల చత్తువు. నేను ఈ మాటను నీకు చెప్పుటకే వచ్చినాను, ఇఁకమీఁద నేను పోవుచున్నాను – అని నక్క చెప్పెను. ఆమాటలు చెప్పిన పిమ్మట నక్కయొక్క మాట నిజమేమో అని ఆయెలుకను అక్కడనే యుంచి పాఱిపోయెను. పిల్లి పోయిన సంగతిని నక్క తెలిసికొని ఆ యెలుక యెక్కడ నుండెనో అక్కడికి వెళ్ళి దానిని తినెను. పిల్లి మరల పూర్వస్థలమునకు వచ్చి చూచెను. అపుడు ఆ నక్క యెలుకను తినుచున్నది. ఓ నక్కా! నీవిపు డాయెలుకను ఎట్లు తినుచున్నావని అడిగెను. ఓసి తెలివితక్కువదానా! నే నాయెలుకయొక్క పండ్లను ఆవుపేడతో శుద్ధిచేసి తినుచున్నాను కాని ఊరకే తినుట లేదు అని చెప్పి నవ్వెను. పిల్లియు మిగుల విచారించెను.

## ఏకపంచాశః పాఠః = ఏఁబదియొకటవ పాఠము

నక్షత్రం = నక్షత్రము

సంవత్సరః = సంవత్సరము

మాసః = నెల

పక్షః = పక్షము

ఉత్తరాయణం = ఉత్తరాయణము

దక్షిణాయనం = దక్షిణాయనము

అభావః = లేకపోవుట

జ్ఞానం = తెలివి

ధనం = డబ్బు

అనుగచ్ఛతి = వెంబడించుచున్నాఁడు

అనుధావతి = వెంటపరుగెత్తుచున్నాఁడు

అన్వగచ్ఛత్ = వెంబడించెను

అన్వధావత్ = వెంటపరుగెత్తెను

ఉష్ణః = వేడియైన     కల్పయతి = ఏర్పఱచుచున్నాడు
శీతః = చల్లని     సంకల్పయతి = సంకల్పించుచున్నాడు
ఉష్ణత్వం = వెచ్చన
శీతత్వం = చల్లన     సమకల్పయత్ = సంకల్పించెను
బలం = బలము

శ్వః భానువాసరే దివా పుష్యమీనక్షత్రే రామస్య వివాహః భవిష్యతి, యూయం సర్వేపి తదా ఆగచ్ఛత. మమ ధనం నాస్తిచేత్ కిం, వివాహం యథావిధి కరిష్యామి. గోపాలస్య జనకః పింగళసంవత్సరే కార్తీకమాసే కాలమకరోత్. తదా అహం గ్రామే నాసం. త్వం దుర్బలః తతః శీతోదకే స్నానం మా కురు. అహం ప్రతిదినం ఉష్ణోదకే ఏవ స్నానం కరోమి. కిమరే తవసుతరాం జ్ఞానం నాస్తి రే, కిమర్థం బాలికాంతథా తాడయసి? సా దౌష్ట్యం కరోతిచేత్ కిం కరవాణి? అస్మదుపాధ్యాయః శ్వః ఆగమిష్యతి, తస్య యత్రకుత్రాపి స్థలం కల్పయ. ఇతః పూర్వమేవ తటాకతటస్థితచ్ఛత్రే స్థలం కల్పయిత్వా అస్థాపయం, తత్ర అవరోక్ష్యతి యుష్మదుపాధ్యాయః. యుష్మద్బాలికాయై ఏతత్ఫలం దాస్యసి కిం? సా ఇదానీం అస్మదంబాం అనుధావతి. ఆగమనానంతరం దాస్యామి - వయం ఏకదా శ్రీశైలక్షేత్రం గత్వా ప్రథమం పాతాళగంగాయాం స్నానం కృత్వా అనంతరం దేవపూజార్థం సమకల్పయామ. శంకరస్య హస్తే ధనాభావాత్ శ్రీశైలంప్రతి నాగచ్ఛత్. వివాహం కర్తుం సంకల్పయిష్యసి కిం? త్వం కిమర్థం హ్యః రామం అన్వధావః? సః స్నానార్థం తటాకం ప్రత్యగచ్ఛత్, శీతజలాసయనార్థం తేన

పాకం అధావం. ఏతస్మిన్ దినే సూర్యః అతీవ ఉష్ణం ప్రకాశతే. హ్యాః నక్తం ఆకాశే చంద్రః శీతం ప్రాకాశత. ఏకః మార్జారః అస్మదావరణే రక్తపుచ్ఛం అనుధావతి పశ్య పశ్య.

మీ తండ్రియొక్క పెట్టెలో డబ్బున్న యెడల ఇప్పు తీసికొనిరమ్ము. మా తండ్రిగారిపెట్టెలో డబ్బెక్కడ నున్నదండీ? నేను రేపు ప్రయాణముచేయుటకు సంకల్పించితినిగాని నీవు కూడ నాతోకూడ వత్తువా? రే పుత్తరాయణపుణ్యకాలము గదా; మాతండ్రి నన్ను ఎక్కడికిని వెళ్లవద్దని అన్నాడు. నీపెట్టెలో డబ్బున్నదో లేదో నా కొకపర్యాయము చూపించుము. అటులైన చెప్పెదను. గ్రీష్మకాలమందు సూర్యుడు దెప్పుడును వేడిగనే వెలుగుచుండును. శరత్కాలమందు రాత్రులయందు చంద్రుడు చక్కగా ప్రకాశించును. సంధ్యావందనమునకు చోటు నేర్పఱచుము. ఏమిరా నాయనా! మీయమ్మతో కూడ మామగారియింటికి భోజనమునకు వెళ్లుదువా? అలాగే వెళ్ళెదను. వానివెంట పరుగెత్తుచున్నా వెందుకురా? మా యింటిలో పెరుగు లేదుగాని ఇవ్వేళ కొంచెము మజ్జిగ ఈ గిన్నెలో బోయుము. నాకు పెండ్లిని ఎపుడు చేయుదువు నాయనా! ఈ నెలతరువాత చేయుదును. అంతవఱకును జాగ్రత్తతో నుండుము. నీటిలో వెచ్చన లేదు. అంగడిలో జీలకఱ్ఱ ఉన్నదో లేదో విచారించుము. నేను ఇపు డుండుటకు ఒకయింటిని ఏర్పఱచినాను. మాకుకూడ నొకయింటి నేర్పఱతువా? రేపు సాయంకాలము మా యింటికి రమ్ము.

ద్వా పంచాశః పాఠః = ఏబదిరెండవ పాఠము

| | |
|---|---|
| శరీరం = శరీరము | తిక్తత్వం = చేదు |
| గ్రీష్మకాలః = ఎండకాలము | ఆమ్లత్వం = పుల్లన |
| వర్షకాలః = వానకాలము | అపేక్షితం = కావలసినది. |
| శీతకాలః = చలికాలము | దృశ్యతే = కనబడుచున్నాడు |
| మూఢత్వం = అజ్ఞానము | ఆక్షిపతి = ఆక్షేపించు |
| సంకల్పః = సంకల్పము | [చున్నాడు |
| ఆతపః = ఎండ | ఆక్షేప్స్యతి = ఆక్షేపింపగలడు |
| పంచాంగం = పంచాంగము | ద్రక్ష్యతే = కనబడగలడు |
| దార్ఢ్యం = దార్ఢ్యము | ఉద్దిశతి = ఉద్దేశించుచున్నాడు |
| దృఢం = గట్టిది | సందిశతి = కబురంపుచున్నాడు |
| మాధుర్యం = తీపి | |

యుష్మదంబాయాః శరీరే సుతరాం బలం నాస్తి, పంచాంగమానయ, ఏతద్దినే నక్షత్రం కింవా పశ్యామ. పంచాంగం కుత్రాస్తి వా, నాదృశ్యత. మమ హస్తం చలయితుమపి దార్ఢ్యం నాస్తి. అస్మద్వస్త్రం దృఢమేవాస్తి. కిమర్థం మాం సర్వదా ఆక్షిపసి? తవ జనకః కుత్రాగచ్ఛత్, మాసప్రభృతి నదృశ్యతే. మమ ఈషత్ లవణమపేక్షితం పరివేషయత. అస్మత్పుత్రాయ సందిశ. యుష్మత్కూపజలే మాధుర్యం నాస్తి. గతదినే ఆతపః సమ్యగాసీత్. ఘృతం ఈషత్ ఆతపే స్థాపయ, ద్రవిష్యతి కింవా. దేవస్య సంకల్పః కథమస్తి వా. సా కాలంకరిష్యతి కింవా? యుష్మత్ కలశః కుత్రాస్తి వా శ్వః ద్రక్ష్యతే, ఇదానీం మాపిచా

రయతి. తవజనకః కిం ఉద్దిశతి? అపేక్షితం పృచ్ఛ పరివేషయిష్యామి. పరివేషణం ఆసీత్, యూయం సర్వేపి ఆగచ్ఛత నోచేదన్నం శుష్యతి గ్రీష్మకాలే మల్లికాపుష్పాణి లతాసు సమ్యక్ దృశ్యేరన్. అరే రే పశ్యపశ్య తద్వృక్షే సర్పః లంబతే, తత్రై యః కశ్చిత్ అస్తి చేత్ మారయితుం ఆహ్వయ. కిమరే రామ! త్వం కుత్రాపి న దృశ్యసే కిం? అహం కుత్రాగచ్ఛం; అత్రైవాస్మి ఖలు. త్వాం ద్రష్టుం మమాంబా వాంఛతి. ఏకవారం అస్మద్గృహం ఆగచ్ఛ. ఇదానీం మమ అవకాశః నాస్తి; శ్వస్సాయం ఆగమిష్యామీతి కథయ. తవ కిమపేక్షితం? క్షీరమపేక్షితం; అస్తిచేద్యచ్ఛ.

రాముఁడు సీతతో కూడ అడవిని ప్రవేశించెను. లక్ష్మణుఁడును రాముని వెంబడించెను. ఇట్లుండఁగా సీత స్నానము చేయుటకు గోదావరికి వెళ్ళెను. అక్కడ నొకరాక్షసుఁడు ఆమెకుఁగనఁబడెను. వాఁడే రావణాసురుఁడు. వాఁడు సీతను చూచి నీ వెవతెవని అడిగెను. నేను రామునియొక్క భార్యను అని బదులు చెప్పెను. అప్పుడు రావణుఁడు సీతను ఎత్తుకొని పోయెను. పిమ్మట రాముఁ డింటికి వచ్చిచూచెను. సీత యెక్కడను కనఁబడకుండెను. పిమ్మట రాముఁడు లక్ష్మణునితో కూడ బయలుదేరి కిష్కింధాపురమునకు వెళ్లెను. అక్కడ రామునకు సుగ్రీవుఁడు కనఁబడెను. రాముఁడు తనవృత్తాంతమును సుగ్రీవునకు చెప్పెను. ఆ మాటను సుగ్రీవుఁడు విని తనయొక్క వానరులను సీతకొఱకు పంపెను. సీత లంకయందు అశోకవనమునం దుండెను. ఆంజనేయుఁడు లంకకుఁబోయి సీతను జూచి

మళ్ళీ రామునిదగ్గఱకు వచ్చి ఓరామా ! నాకు సీత కనఁబడెను, అని చెప్పి రాముని తనమాటలచేత సంతోషపెట్టెను. అప్పుడు రాముఁడు లంకకుఁ బోయి రాక్షసుల నందఱిని చంపి రావణుని చంపి లంకను విభీషణున కిచ్చి తిరిగి అయోధ్యకు వచ్చి రాజ్యమును పాలించెను. జనులను సంతోషపెట్టెను.

## త్రిపంచాశః పాఠః = ఏఁబదిమూఁడవ పాఠము

| | | | | | |
|---|---|---|---|---|---|
| దర్శనం | = | చూచుట | శ్యాలకః | = | బావమఱఁది |
| దారిద్ర్యం | = | పేదరికము | భావః | = | బావ |
| భాగ్యం | = | భాగ్యము | పౌత్రః | = | మనుమఁడు |
| దయా | = | దయ | జ్వలతి | = | వెలుఁగుచున్నాఁడు, మండుచున్నాఁడు |
| కోపః | = | కోపము | | | |
| సంతోషః | = | సంతోషము | జ్వాలయతి | = | వెలిఁగించుచున్నాఁడు |
| కృత్యం / కార్యం | = | పని | భ్రమతి | = | తిరుగుచున్నాఁడు |
| రోగః | = | రోగము | భ్రామయతి | = | త్రిప్పుచున్నాఁడు |
| దోషః | = | దోషము | త్రుట్యతి | = | తెగుచున్నది |
| శ్వశురః | = | మామ | త్రోటయతి | = | త్రెంపుచున్నాఁడు |

మాసాత్ ప్రభృతి యుష్మాకం దర్శనం నాస్తి. యూయం సర్వేపి కుత్రాస్త? వయం కృష్ణాస్నానార్థం అగచ్ఛామ. ఏతదంతరే అస్మద్బాంధవగృహే ఏకః యజ్ఞః అచలత్. తం ఉత్సవం ద్రష్టుం ఏతావత్పర్యంతం తత్రైవ అవసామ. వ్యాః

సాయం స్వగృహం ప్రతి ఆగచ్ఛామ. తవ కిమర్థం మయి సర్వదాపి కోపః? దేవాలయం గత్వా తత్ర దీపం జ్వాలయత. కిమర్థం, తత్ర దీపః సమ్యగేవ జ్వలతి. ఏతం బాలకం తటాకసమీపే ఉపత్యకాం భ్రామయ. దారిద్ర్యేణ సర్వేషామపి దుఃఖం భవిష్యతి. భాగ్యేన సుఖం భవిష్యతి. అస్మద్ శ్వశురః హ్యః ప్రాతఃకాలే మదరాసునగరం ప్రతి అగచ్ఛత్. యుష్మాకం దారిద్ర్యాభావాత్ సర్వదాపి సంతోషః ఏవ. సర్వేషు నరేషు దయాం స్థాపయత. బాలకః పూర్వేద్యుః కంఠే నూతన యజ్ఞోపవీతం ధృత్వా ఆపణం అగచ్ఛత్. తత్ర ఏకః బాలకః తస్య యజ్ఞోపవీతం హస్తేన అత్రోటయత్. కిమర్థం తే సర్వే ఇతి స్థితాః తూష్ణీమేవ భ్రమంతి? తాసాం అంగనానాం వస్త్రశోధనం ఆసీత్ చేత్ వయం శీఘ్రం గత్వా స్నానం కరవామ. ఆగచ్ఛత. తాసాం స్నానాదికం ఇదానీం కుత్ర భవిష్యతి? అరే తవ భావస్య శరీరే కో రోగః? కింవా మయా నజ్ఞాయతే. శరీరే అస్యః రోగః నాస్తి, గృహే దారిద్ర్య రోగః. రామః యదాఽచోరయ త్తవ వస్త్రాణి అహం తత్రాసం. సః మాం దృష్ట్వా అత్రసత్. కుశః త్రోటిష్యతి.

గదిలో దీపము వెలుఁగుచున్నదో లేదో చూచిరందు.
మీ బావమఱదికి పెండ్లి అయినదా? ఎవనికూఁతు నిచ్చిరి?
గోవిందాచార్యులుగారూ! మీ మనుమనికి ఉపనయనమెప్పుడండీ?
వచ్చెదు సంవత్సరమందు మాఘమాసములో చేయఁగలను.
మీ పిల్లలందఱును ప్రతిదినము మా నులకమంచముమీఁద పడి అల్లరిచేయుచున్నారు. అందువలన నులకంతయు తెగుచున్నది.

నే నేమయినను అన్నయెడల మీకు కోపము. వారు (అల్లరి వాండ్రు=దుష్టాః) చాలు చాలు మా పిల్లలు చెడ్డవారును మీ పిల్లలు మంచివారునా? నీ మాట చాల బాగుగా నున్నది. ఎప్పుడును మీ రబద్ధమే మాట్లాడుచుందురు. మా మేనమామ తన కొడుకును గుంటూరు నగరములో హూణభాషను చదివించుచున్నాఁడు. ఇప్పుడు ప్రతివానికిని అదేపనిగదా. ఎందుకనఁగా ఆభాష రాజభాషగా నున్నది. ఏమో నేను (మాత్రము=తు) సంస్కృతమునే చదివింపఁగలను. మంచిదే. రెండు నెలలయినతరువాత నీకు సంస్కృతప్రారంభము చేయుదును. మాల మీ దర్శనము మా కెప్పుడగునో! నిన్న మీ ఆవు కనఁబడ లేదంటిరే కనఁబడినదా? ఆవు ఈవేళ కనఁబడినదిగాని దూడ కనఁబడ లేదు. కోడెదూడా పెయ్యదూడా? పెయ్య. మా మనుమని పిల్చి అడుగుము.

చతుఃపంచాశః పాఠః = ఏఁబదినాల్గవ పాఠము

| | | | |
|---|---|---|---|
| ప్రారంభః | = ప్రారంభము | స్తంభః | = స్తంభము |
| ఉత్సవః | = ఉత్సవము | వైద్యః | = వైద్యుఁడు |
| దీపః | = దీపము | అపేక్షతే | = అపేక్షించుచు[న్నాఁడు, కోరుచున్నాఁడు |
| బాంధవః | = బంధువు | | |
| నూతనః | = క్రొత్తవాఁడు | అపైక్షత | = అపేక్షించెను, [కోరెను. |
| ఆదిమం | = మొదలైనవి | | |
| ఉద్యోగః | = ఉద్యోగము | జాయతే | = పుట్టుచున్నాఁడు |
| అపేక్షా | = దయ | జనిష్యతే | = పుట్టఁగలఁడు |

తావన్మాత్రేణైవ = అంతమాత్రమునకే ఆరభతే = ఆరంభించుచున్నాడు

పీఠః = పీట కుప్యతి = కోపపడుచున్నాడు

దర్భాసనం = దర్భాసనము

ఏష బాలకః నూతన ఇవాస్తి. సత్యమేవ. నాగాంబాయాః పుత్రః విశాఖపట్టనాత్ ఆగచ్ఛత్. నాగమాంబా కా? సాపి మమ నూతనా. కోదండరామస్య ద్వితీయభార్యా. కోదండరామః కోనుసః? అప్పళాచార్యస్య శ్వశురః. అప్పళాచార్యః ఇదానీం క్వాస్తి? దేశాంతరం గతః. యుష్మద్గృహే శాకపాకాదికాని కా అకరోత్? సా ఏవ. త్యాగరాజస్య కః ఉద్యోగః? ఉద్యోగవచనం కిమర్థంతు, ఏకం ప్రశ్నం ప్రక్ష్యామి కథయ. కః ప్రశ్నః? తస్యా గర్భే పుత్రః అస్తివా, పుత్రికా అస్తివా? ఈషదాలోచ్య కథయిష్యామి, తావత్పర్యంతం బహిస్తిష్ఠ, అంతర్మాగచ్ఛ. అత్రైవ స్థాస్యామి; ఝటితి కథయిష్యథ కిం! నక్షత్రాణి గణయిత్వా అనంతరం పుత్రః జనిష్యతే వా పుత్రికా జనిష్యతే వా వదిష్యామి, త్వరయసే కిమర్థం? మమ త్వరా నాస్తి తాతాచార్య! మా కుప్య. ధీరం ధేయ! అహం కుప్యామి కిం? త్వమేవ మాం త్వరయసే వృథా. తత్ర స్తంభోపరి పంచాంగమస్తి; ఇత్థమానయ. మమ నశక్యతే ఆనేతుం. తావన్మాత్రేణైవ తవ మర్యాదా గచ్ఛతి కిం? భగ్నకనిష్ఠికాయాం న మూత్రయిష్యస్యపి. ప్రథమతః త్వం బహిర్గచ్ఛ. అనంతరం అహమాలోచయిష్యామి. కో వా ఆగచ్ఛతి అంతః. ఓహో హో! వైద్యః బలిద్ధాచార్యః ఆగతః. అస్తునామ.

అరే నీ మెడలో జందెము కనఁబడదేమి! అయ్యో, చెఱువులో స్నానము చేయునపుడు మెడనుండి జాఱిపోయినది. ఏమోరా ఇపు డేమిచేయుదును? మా తండ్రి చూచినయెడల (చూస్తే) కొట్టఁగలఁడు. (కొడతాడు.) నీదగ్గర నొక జందె మున్నయెడల నాకొఱ కిత్తువా! రేపు మరల నీ కిచ్చెదను. వారందఱు నెవరి బాంధవులు? మొదట అక్కడ పీఁట వేసి దానిమీఁద దర్భాసనము పఱచుము. నేను స్నానము చేసి వచ్చి సంధ్యావందనము చేసికొందును. మీ అమ్మ కోపము చేయునేమో త్వరగా పొమ్ము; భోజనమైన తర్వాత వత్తువు గాని. రేపు సాయంకాలమునందు రామాయణమును ప్రారంభింపుము. నిన్న మీ యింటికి వైద్యుఁడు వచ్చినాఁడెందుకురా? అంతమాత్రానికే కోపపడెద వేల? మా యూరిలో రేపటి నుండియు రాములవారికి ఉత్సవములు జరుగును. నీకు మా యందు అపేక్ష యున్నయెడల ఉత్సవము చూచుట కైనను మాయూరికి వచ్చి మమ్మును చూడఁగలవు. లేకపోయినయెడల లేదు. నా కూఁతునకు కూఁతురు పుట్టినది. (నాలుగు దినము లైనవి.-దినచతుష్టయం అసీత్); అయిదవదినమందు పథ్యమును ఇత్తురు. వారు నిన్ననే యజ్ఞమును మొదలు పెట్టినారు. దానితోఁగూడ సప్తాహమును గూడ చేయుదురఁట. బాగుగనే యున్నది.

## పంచపంచాశః పాఠః = ఏఁబదియైదవ పాఠము

నపుంసకలింగ సర్వనామశబ్దములలో ప్రథమా, ద్వితీయా విభక్తులు ఒక విధముగనే యుండును. తక్కిన విభక్తులు పుంలింగములకువలె నుండును.

| | ఏ. | బ. | ఏ. | బ. |
|---|---|---|---|---|
| ప్ర. ద్వి. } | తత్ = అది, | తాని = అవి, | కిం = ఏది? | కాని = ఏవి? |
| ,, | ఏతత్ = ఇది, | ఏతాని = ఇవి, | యత్ = ఏది? | యాని = ఏవి? |
| ప్ర. ద్వి. } | అన్యత్ = మఱియొకటి. | | అన్యాని = మఱికొన్ని | |
| ,, | ఏకం = ఒకటి | | దీనికి బహువచనము లేదు. | |
| ,, | సర్వం = ప్రతిది | | సర్వాణి = అన్ని | |

కతి-త్వం-అహం అనునవి మూఁడును మూఁడులింగములలోను ఒకవిధముగనే యుండును.

| | |
|---|---|
| అపరాధః = తప్పు | కృతః = చేయఁబడిన |
| కోపః = కోపము | పఠితః = చదువఁబడిన |
| తాపః = తాపము | అపేక్ష్యతే = అపేక్షింపఁబడుచున్నది, [కావలయును |
| జ్యేష్ఠః = పెద్దవాఁడు | |
| కనిష్ఠః = చిన్నవాఁడు | డోలాయతే = ఊఁగుచున్నాఁడు |
| చింతా = చింత | చింతయతి = చింతించుచున్నాఁడు |
| అపేక్షితః = కావలసిన-అపేక్షింపఁబడిన | |

| | |
|---|---|
| భగ్నః = విఱిగిన | జానాతి = ఎఱుఁగుచున్నాఁడు |
| జ్ఞాతః = తెలిసిన, తెలియఁబడిన | జ్ఞాస్యతి = ఎఱుఁగఁగలఁడు |
| దృష్టః = చూడఁబడిన | జ్ఞాస్యతే = తెలియఁగలఁడు |

ఏషః మమ జ్యేష్ఠపుత్రః, సః ద్వితీయపుత్రః, అన్యః కనిష్ఠః. పూర్వేద్యుః సాయంసమయే తాతాచార్యస్య కనిష్ఠపుత్రః, వేంకటేశ్వరేణసాకం వనం గత్వా తత్ర ఏకం వృక్షం ఆరుహ్య వృక్షాత్ అధః అపతత్. పతనానంతరం తస్య హస్తః భగ్నః ఆసీత్. తతః ద్వితీయదివసే ఏకం వైద్యం ఆనీయ తస్మై భగ్న హస్తం అదర్శయన్. సః స్వేన కృతం తైలం ఆనీయ హస్తం సమ్యక్ అమర్దయత్. ఇదానీమపి ప్రతిదినం మర్దయత్యేవ. సః వైద్యః అతీవ కోపిష్ఠః. తథావా! తం కదాపి అహం నజానామి. శ్వోవా పరశ్వోవా జ్ఞాస్యసి. ఇతః పూర్వం త్వయా కదాపి న దృష్టః కిం? దృష్టః చేత్ కిం, నదృష్టః చేత్ కిం? కదాపి అస్మాకం వైద్యదర్శనమేవ మాస్తు. సీతారామస్య కనిష్ఠపుత్రికాం కస్మై అయచ్ఛత్. కస్మైచిత్ వృద్ధాయ అయచ్ఛత్. వివాహః కుత్ర కృతః? తటాకసమీపస్థితశివాలయే కృతః. అరే శాకుంతలనాటకం పఠ ఇతి అవదం ఖలు, త్వం అపఠః కిం? నహినహి ఏతావత్పర్యంతమపిమయా నపఠితం. సర్వదాపి మమ శరీరే తాపః, తదర్థం వైద్యసమీపం గచ్ఛామి. పూర్వేద్యుః యుష్మద్కృష్ణః ఏకం అపరాధ మకరోత్. సః అపరాధః తవ జ్ఞాతః కిం? నహి కింతు తదర్థమేవ సః పూర్వేద్యుః చింతయా తూష్ణీం అవసత్ గృహే. సత్యమేవ.

అక్కడ కూర్చుండి యేమో చింతించుచున్నావు. నాయొక్క పుస్తకము మీ అమ్మయొద్ద నున్నదిగాని యిటులఁ దీసికొనిరమ్ము. ఆమె యింట్లో లేదండీ. ఆమె యెక్కడ పెట్టినదో నాకు తెలియదు. తెలియదనెద వేమిరా! ఆమెయొక్క పెట్టెలో జూడుము. ఆమెయొక్క పెట్టె నాకుఁగనబడలేదు. పెట్టె గదిలో నున్నదేమో చూడుము. చూచినాను. మీపుస్తకము పెట్టెలోనే ఉన్నది, తెచ్చుచున్నాను. సరేగాని మాపిల్లవాఁ డూయేలయందు ఊగుచున్నాడుగాని వానిని నే రమ్మంటినని పిలువుము. వాఁడిపుడు రా నన్నాఁడు. (నీకు కావలసినయెడల నా చెంబు నిచ్చెదను; దానితో నీవుత్రావుము = త్వయా అపేక్ష్యతే చేత్ = తవ అపేక్షితం చేత్, మత్పాత్రం దాస్యామి; తేన జలంపిబ) నాపంచపాత్ర ఎక్కడనున్నదో యెఱుఁగుదువా? బావిదగ్గరనున్నది. పోనిమ్ము నాపంచపాత్ర) బావియొద్ద నెందుకున్నది? మా అమ్మ చెంబు లన్నిటిని తోముచున్నది. దేనితో తోముచున్నది? చింతపండుతో. మన ఆవు ఎక్కడికి పాఱిపోయినదో ఎవఁడు విచారింపఁగలఁడు! నీవే వెళ్ళి విచారించుము. నేను చాలచోట్ల విచారించితినిగాని కనఁబడలేదు. నిన్న సాయంకాలమున వైష్ణవులదొడ్లో నొక యావు మేయుచున్నదఁట. వైష్ణవుల యింటికి నీ విపుడే వెళ్లి కనుఁగొనిరమ్ము. నీ విచటనే నిలువుము. నేను వెళ్ళి కనుఁగొనివత్తును (ఇదిగో యావు=ఏషా బహుళా) దూడతోఁగూడ వచ్చుచున్నది. ఇఁక నీవు పోవద్దు.

షట్పంచాశః పాఠః — ఏఁబదియాఱవపాఠము.

పాపిష్ఠః = పాపిష్ఠుఁడు
కనిష్ఠః = కనిష్ఠుఁడు
మహిషః = దున్న
చలచిత్తః = చలచిత్తుఁడు
ఉన్మత్తః = పిచ్చివాఁడు
ఖంజః = కుంటివాఁడు
అంధః = గ్రుడ్డివాఁడు
లిఖితః = వ్రాయఁబడిన
పీతః = త్రాగఁబడిన
ఛేదితః = కోయఁబడిన
ధవళః = తెల్లని
అరుణః = ఎఱ్ఱని
ధావళ్యం = తెలుపు
ఆరుణ్యం = ఎఱుపు
ఉద్ఘాటయతి = తెఱచుచున్నాఁడు
ఉదఘాటయత్ = తెఱచెను
జానంతి = ఎఱుఁగుచున్నారు
జానీథ = మీరు ఎఱుఁగుచున్నారు
జానీమః = ఎఱుఁగుచున్నాము
జ్ఞాతుం = ఎఱుఁగుటకు
బధ్నాతి = కట్టుచున్నాఁడు

రామః పూర్వేద్యుః అస్మాకం బహుళాం దండేన అతాడయత్. యుష్మాభిః లిఖితం పుస్తకం కుత్రాస్తి? దేవదత్తః స్వగృహాయ అనయత్. దేవదత్తాయ కిమర్థం అయచ్ఛత? కః అయచ్ఛత్ సఏవ అచోరయత్. అరే పాపిష్ఠ! మా తాడయ మహిషం. ఏకః ఖంజః ద్వారే తిష్ఠతి, తస్మై తండులాన్ యచ్ఛత. పాత్రస్థితం క్షీరం కేన పీతం? యుష్మత్పుత్రైః పీతం. మమ పుత్రాః గృహే ఏవ నసంతి ఖలు, తైః కథం పీతం? త్వం సర్వదా అసత్యమేవ వదసి. రామకృష్ణ! తులసీదళాని త్వయా ఛేదితాని కిం? నహినహి గోపాలః అఛేదయత్. పూజాసమయః ఆసీత్, పుష్పాణి శీఘ్రం ఆనయేతి వద. కోఽస్తి

తతి) వదితుం? రామాచార్యః స్వల్పద్రవ్యేణ వివాహః భవిష్యతీతి ఆశయా ఏకాం కన్యాం (పరి + అనయత్ = పర్యణయత్ = పెండ్లాడెను.) కింతు సా అంధా, చలచిత్తా చ, తేన కారణేన చోష్యే గుడం (క్షిపతి = వేయుచున్నది), పాయసే లవణం క్షిపతి, తక్రపాత్రే తైలం పూరయతి, తైలపాత్రే ద్రవ్యం ప్రవేశయతి; సర్వాన్ పదార్థాన్ అధః పాతయతి. ఏవం స్థితే ఏకదా అహం త్వద్గృహం గత్వా బహిఃస్థిత్వా రామాచార్య! రామాచార్య! ఇతి ఆహ్వయం. అనంతరం సః ఆగత్య కవాటం ఉద్ఘాటయత్. అహం అంతః ప్రావిశం. రామాచార్యః మాం ఏకస్మిన్ పీఠే ఉపవేశ్య స్వస్య చిత్తక్షోభం సర్వమపి యథావిధి అకథయత్.

మీ యావు తెల్లనిది, మాయావు ఎఱ్ఱనిది. వాకిటిలో నొకగ్రుడ్డివాఁడు నిలుచున్నాడుగాని లోనికి పిలువుము. ఆవును ఎవఁడు కట్టివేయుచున్నాడు? మీ పిల్లలు అన్నిసమాచారములను ఎఱుఁగుదురు. (మీ దొడ్లోనున్న మల్లెపూలయందు తెలుపు బాగుగనున్నది = యుష్మదావరణస్థితమల్లికాపుష్పేషు ధావళ్యం సమ్యగస్తి) మా పిల్లలు ఎక్కడనున్నారో, ఏమి చేయుచున్నారో ఇంతవఱకును మే మెఱుగము. నీవు రాముని తెలియుటకు వెళ్ళుము. వాఁడెక్కడ నున్నాఁడో తెలిసికొని రమ్ము. (ఇంతలో = ఏతదంతరే) నేను పురాణారంభమును చేయఁగలను. నీచేయి యెట్టిగా నున్నదేమిరా? ఊరకయే అట్లున్నది. నాచేతియందు ఎఱుపు లేదు. ఆ తెల్లగుఱ్ఱ మెవరిది? బొబ్బిలిరాజుగారిది. నీవు మిగుల కర్మిష్ఠుఁడవు. కాని

చలచిత్తుఁడవు. ఓరిపిచ్చివాఁడా! కర్మిష్ఠుఁడు చలచిత్తుఁ డెట్లు కాఁగలఁడురా? మాబావగారి బావిలో నొకయుడుత పడినది. చచ్చినదా? బ్రతికినదా? ఎవఁడెఱుఁగు? చచ్చినతర్వాత కొంత సేపటికి ప్రాణములు పోయినవని మాబావమఱఁది చెప్పినాఁడు. గుడ్డిపెండ్లాము కథ యేమాయెను? అపుడే పోయినది. ఇంత వఱకును ఉన్నదా? ఆకథ చాల బాగుగానున్నది. కొంచెము చెప్పుఁడు. రేపు రమ్ము. మఱియొకకథను చెప్పెదను.

సప్తపంచాశః పాఠః = ఏఁబదియేడవ పాఠము

| | |
|---|---|
| స్వభావః = స్వభావము | అనుపదం = వెంటనే |
| నిద్రా = నిద్దుర | ఆకర్ణయతి = వినుచున్నాఁడు |
| చాకచక్యం = చుఱుకుఁదనము | అనుభవతి = అనుభవించు [చున్నాఁడు |
| అవస్థా = అవస్థ | |
| ఆశా = ఆశ | అన్వభవత్ = అనుభవించెను. |
| సకలః = సమస్తమైన | బధాన = కట్టుము |
| కర్ణః = చెవి | బధ్నాతి = కట్టుఁడు |
| బధిరః = చెవిటివాఁడు | జానీహి = తెలిసికొనుము, [ఎఱుఁగుము |
| మాత్రం = ఎఁడు | |
| తావతైవ = అంతటితోనే | జానీత = తెలిసికొనుఁడు; [ఎఱుఁగుఁడు. |
| అనుభూయ = అనుభవించి | |
| బంద్ధుం = కట్టుటకు | భేదయతి, భిందతి = బిద్దలుగొట్టు చున్నాఁడు |
| ఆకర్ణ్య = విని | |

ఏకస్మిన్ గ్రామే నారాయణభట్టోనామ బ్రాహ్మణః అవసత్. సః అతీవ అమాయికః, పూర్వకాలమనుష్యః వేద చతుష్టయం నాంతం అపఠత్. తస్య సంగీతే అతీవ అపేక్షా ఆసీత్. సంగీతాభ్యాసార్థం దేశాన్తరం గంతుం సమకల్పయత్. అనంతరం భార్యాసమీపం గత్వా హేభార్యే! అహం సంగీతార్థం దేశాంతరం గమిష్యామి, తవ అభిప్రాయం వద ఇతి తాం అపృచ్ఛత్. తదా సా హసిత్వా హేనాథ! సంగీతార్థం దేశాంతర గమనం కుతః? అత్రైవ స్థిత్వా సంగీతాభ్యాసం కురుత, ఇత్యకథయత్. తస్యాః వచనం ఆకర్ణ్య మమ సంగీతం సుతరాం నజ్ఞాతం; తస్మాత్ అత్రస్థిత్వా కథం సంగీతం సంపాదయిష్యామి ఇత్యపృచ్ఛత్. తదా సా ఏవ మవదత్. భో నాథ! సంగీతాభ్యాస క్రమం అహం వదిష్యామి ఆకర్ణయత. కథమితిచేత్, శీతకాలే ప్రతిదినం సూర్యోదయాత్పూర్వం ఉత్థాయ గంగాయాం స్నానం కృత్వా గంగాతీరే ఏవ ఉపవిశ్య జపం కుర్యాః చేత్ సంగీతం క్రమశః ఆగమిష్యతి. సః అమాయిక బ్రాహ్మణః తద్వచనం సత్యమేవేతి జ్ఞాత్వా, ద్వితీయ దినాత్ ప్రభృతి, సూర్యోదయాత్పూర్వం శీతకాలే గంగాయాం స్నానం కర్తుం ఉదతిష్ఠత్. స్నానమకరోత్. సంగీతం నాస్తి గింగీతం నాస్తి (పరంతు = కింతు) అతీవశీతబాధాం అన్వభవత్. భార్యా అహసత్.

మాగుజ్జమునకు బొత్తుగా చురుకుదనము లేదు. మా యుపాధ్యాయుడు మిక్కిలి సమర్థుఁడేగాని చెవిటివాఁడు. అది యొక్కటియే ఆయనయందు లోపము. నాచెవిలో కొంచెము నూనె పోయుము. పాపయ్యగారి పెయ్యదూడ మనదొడ్లో

పరివేశించి నాల్గో నున్న చెట్ల నన్నిటిని పాడుచేయుచున్నది. గాని నీవు వెళ్ళి ఆయావులను పున్నాగచెట్టున గట్టుము. నిన్న రాత్రి శివునిగుళ్లో ఎవఁడో హరికథను చెప్పినాఁడఁట. మీరు విన్నారా? వాకిటిలో నెవరో పిలుచుచున్నారు. తెలిసికొనుము. ఎవరో కారు మీ మామగారే. నేను అంగడికి వెళ్ళి వెంటనే వత్తును; అంతవఱకును నీవు ఎక్కడకును వెళ్ళవద్దు. వాఁడు సమస్తబాధలను అనుభవించి చివఱకు చచ్చెను నీమేనమామ నాకోసము మాయింటికివచ్చినాఁడుగదా. (ఇదిగో=ఏషః)వచ్చు చున్నానయ్యా అని చెప్పితిని. అంతటితో నే పోయెనేమి? ఆఁకా తిని బిద్దలు గొట్టుము. నాకొక చిటికెఁడు (పొడుము = నస్యం) పెట్టుము. నాకు ఎందులకోగాని నిద్ర వచ్చుటలేదు. నీవు చాల దుష్టుఁడవు. నీ స్వభావము మంచిదికాదు. నాఅవస్థ నేమనిచెప్పుదును? నా పెండ్లాము గ్రుడ్డిది, చెవిటిది, కుంటిది కాని భోజనమునకు మట్టుకు పెద్దది. నీ అదృష్ట మది; నా అదృష్ట మిది. నా యాశ వ్యర్థ మైనది.

### అష్టపంచాశః పాఠః = ఏఁబదియెనిమిదవ పాఠము

| | |
|---|---|
| నాథః = పెనిమిటి, ప్రభువు | సమస్త్యాం = మొత్తాన |
| అభిప్రాయః, ఉద్దేశః = ఉద్దేశము | పక్వః = ఉడికిన, పండిన |
| చతురః, నిపుణః = నేర్పరి | శక్యః = అలవియైన |
| చాతుర్యం, నైపుణ్యం = నేర్పు | స్వతః = తనకు తాను |
| | వర్ణయతి = వర్ణించుచున్నాడు |
| | అజానాత్ = తెలిసికొనెను |
| | అజానన్ = తెలిసికొనిరి |

| | | | | | |
|---|---|---|---|---|---|
| క్రిమః | = | వయస | అజానాః | = | తెలిసికొంటివి |
| ప్రయాసః | = | ప్రయాసము | అజానీత | = | తెలిసికొంటిరి |
| ఆర్ద్రః | = | తడిసిన | అజానాం | = | తెలిసికొంటిని |
| శుష్కః | = | ఎండిన | అజానీమ | = | తెలిసికొంటిమి |
| అధికః | = | గొప్ప | అబధ్నాత్ | = | కట్టెను |
| ఆధిక్యం | = | గొప్పతనము | బద్ధ్వా | = | కట్టి |

మమ అభిప్రాయః ఏషః. అనంతరం త్వదిచ్ఛానుసారేణ కురు. మమ అంగవస్త్రం కిమర్థం ఆర్ద్రం అభవత్ ? జలే అపతత్కిం వా. త్వమపి దుష్టేనసాకం దౌష్ట్యం కుర్యాః చేత్ తవాధిక్యం కిమస్తి ? తత్రఏకం శుష్కం వస్త్రం అస్తిచేత్ ఇత్థమానయ. రామః కుత్రాస్తివా అజానాః కిం ? దినత్రయాత్ప్రభృతి రామః అద్యాపి నాదృశ్యతైవ. కుత్రాగచ్ఛద్వా కః జానాతి. సమష్ట్యాం సర్వేపి సర్వేఏవ. మమాగ్రజః స్వతః ఏవ గత్వా తత్ర తత్ర దృష్ట్వా ఆగచ్ఛత్. కుత్రాపి నాదృశ్యత కిల. ఏతత్ సమస్తం అపి ప్రయాసార్థం ఆగచ్ఛత్. అస్మాకం బహుళా యత్ర కుత్రాపి దృశ్యతేచేత్ బద్ధ్వా తస్యై తృణం యచ్ఛ. పూర్వేద్యుః సాయం ఏకః శూద్రః యుష్మద్బహుళాం స్వగృహే అబధ్నాత్, అహమపశ్యం. ఏషః మాధవః స్వస్య సౌందర్యం సర్వదా వర్ణయతి. తాతాచార్య ! తవ పుత్రః అతీవ దుష్టః; కేనాపి దండయితుం శక్యః నభవతి. తం ఆనేష్యసి చేత్ త్వం అధికనిపుణః ఏవ. తవ చాతుర్యం అస్తిచే దస్తు ; మాం కిమర్థం పరిహససి ? మమ నాథః గ్రామాంతరం అగ

చ్ఛత్. త్వం (పునః పునః = వారం వారం = ముహుర్ముహుః = పదేపదే) అస్మద్గృహం మాగచ్ఛ. తవ స్వభావః న సమీచీనః.

ఏకోనషష్టితమః పాఠః = ఏఁబదితొమ్మిదవ పాఠము

| | | | |
|---|---|---|---|
| అంజలిమాత్రం | = దోసెఁడు | యామః | = జాము |
| ధ్వాంతం | = కటికిచీఁకటి | ప్రహారః | = దెబ్బ |
| చంద్రికా | = వెన్నెల | శిఖాయ | = ప్రాతి |
| సద్భావః | = ఉండుట | లగతి | = తగులుచున్నది |
| అబ్దః | = అర్ధము | నిఖనతి | = ప్రాతుచున్నాఁడు |
| అట్టః | = పంటచెఱకు | న్యఖనత్ | = పాతెను |
| నిర్భయం | = భయము లేకుండ | జానీయాత్ | = తెలిసికొనును |
| గవాక్షః | = కిటికీ | జానీయుః | = తెలిసికొందురు |
| అర్గళా | = గడియ | బధ్నీయాం | = కట్టుదును |
| ఘటికా | = గడియ | బధ్నీయామ | = కట్టుదుము |

అద్య నక్తం చంద్రికా సమ్యగస్తి. పూర్వేద్యుః ఆకాశే సర్వత్ర మేఘసద్భావాత్ నక్షత్రాణి సమ్యక్ నాదృశ్యంత. అబ్దం ఇత్థం ఆనయ ముఖం పశ్యేయం. తటాకసమీపే ధంకః ఇతస్తతః సంచరతి; కథ మహం స్నానార్థం గచ్ఛేయం? ధంకః త్వాం కిం కరిష్యతి? త్వం నిర్భయం గచ్ఛ. ఆవరణ ద్వారస్య అర్గళా దృఢం నాస్తి, రాత్రికాలే చోరాః ప్రవేక్ష్యంతి కింవా (న కేవలం కవాటస్య = తలుపునకు మాత్రమే కాదు) కింతు గవాక్షస్యాపి అర్గళా నాస్తి. గవాక్షస్య అర్గళా నాస్తి చేత్కిం భయం రే? త్వం అద్య నక్తం యామద్వయ

పర్యంతం త్వత్రైవ సంచర. (అస్మిన్దినే = ఈరోజున) పంచదశ ఘటికాపర్యంతం చంద్రికా ప్రకాశిష్యతే, తావత్పర్యంతం తవ భయం నాస్తిఖలు. అనంతరం ధ్వాంతం ఆగమిష్యతి. తదా అహమేవ తత్ర తిష్ఠేయం. మమ పాదే పూర్వేద్యుః నక్తం పాషాణప్రహారః అలగత్. తస్మాత్ పాదః (శూలతి=నొప్పిపెట్టుచున్నది.) అద్య గృహే అట్టం నాస్తికిల; త్వం తత్ర ఉపవిశః అహమత్ర ఉపవిశేయం; పాకః కథం భవిష్యతి? ఆపణం గత్వా శకటమాత్రం అట్టం ఆనయ. అంజలిమాత్రమపి జలం నాస్తి అస్మత్కూపే.

నిన్న నేను రామునితోఁ గూడ వెన్నెలలో భోజనమును జేసితిని. అపుడు గవాక్షమునుండి యొక పిల్లి (కూన = కిశోరః) వచ్చి నాదగ్గర భయములేకుండ కూర్చుండి నా విస్తరిలో నున్న పరమాన్నము నంతయుఁ దినెను. ఈ మల్లె తీగెను మీ దొడ్లో పాతుము. ఈ వేళ నింతవఱకు నెన్ని గంటలు అయినవో తెలియలేదు. ప్రతిరోజును మీ దూడను ఎవరు కట్టుదురు? అద్దములో నీ మొగము బాగుగఁ గనఁబడెనా లేదా? ఇవ్వేళనే బాగుగ చూచుకొనుము. రేపేగా మీ యింటిలో శుభకార్యము. శుభకార్యమయినచో నాకేమి? ఈ స్తంభమును ఇక్కడ పాతి దానియందు మా ఆవును కట్టుము—రేపు పెండ్లికొడుకు నెవరెవరు వత్తురో మేమే తెలిసికొందుము. ఇవ్వేళ పొద్దుటినుండియు పదిదెబ్బలు తగిలినవి. ఎవరు నిన్న గుళ్ళో ఉపన్యాసమును చెప్పిరి? తాతాచార్యులుగారు చెప్పినారు. ఏవిషయములో? బాల్యవివాహములు మంచివి కావని

చెప్పినారు. ఏభాషలో చెప్పినారు? ద్రావిడభాషలో చెప్పినారు. నీకు బాగుగ తెలిసెనా? నే నక్కడికి వెళ్ళనే లేదు.

## షష్ఠితమః పాఠః = అరువదియవ పాఠము

### బంధ్ = కట్టుట

| | వర్తమానకాలము | | భూతకాలము | |
|---|---|---|---|---|
| | ఏ | బ | ఏ | బ |
| ప్ర. | బధ్నాతి | బధ్నంతి | అబధ్నాత్ | అబధ్నన్ |
| మ. | బధ్నాసి | బధ్నీథ | అబధ్నాః | అబధ్నీత |
| ఉ. | బధ్నామి | బధ్నీమః | అబధ్నాం | అబధ్నీమ |
| | **భవిష్యత్కాలము** | | **ఆజ్ఞాది** | |
| | ఏ | బ | ఏ | బ |
| ప్ర. | భంత్స్యతి | భంత్స్యంతి | బధ్నాతు | బధ్నంతు |
| మ. | భంత్స్యసి | భంత్స్యథ | బధాన | బధ్నీత |
| ఉ. | భంత్స్యామి | భంత్స్యామః | బధ్నాని | బధ్నామ |
| | **విధి** | | **క్రియాఽనిష్పత్తి** | |
| | ఏ | బ | ఏ | బ |
| ప్ర. | బధ్నీయాత్ | బధ్నీయుః | అభంత్స్యత్ | అభంత్స్యన్ |
| మ. | బధ్నీయాః | బధ్నీయాత | అభంత్స్యః | అభంత్స్యత |
| ఉ. | బధ్నీయాం | బధ్నీయామ | అభంత్స్యం | అభంత్స్యామ |

## క్రీ = కొనుట

| | వర్తమానము | | భూతము | |
|---|---|---|---|---|
| | ఏ | బ | ఏ | బ |
| ప్ర. | క్రీణాతి | క్రీణంతి | అక్రీణాత్ | అక్రీణన్ |
| మ. | క్రీణాసి | క్రీణీథ | అక్రీణాః | అక్రీణీత |
| ఉ. | క్రీణామి | క్రీణీమః | అక్రీణాం | అక్రీణీమ |

| | భవిష్యత్తు | | ఆశీరాది | |
|---|---|---|---|---|
| | ఏ | బ | ఏ | బ |
| ప్ర. | క్రేష్యతి | క్రేష్యంతి | క్రీణాతు | క్రీణంతు |
| మ. | క్రేష్యసి | క్రేష్యథ | క్రీణీహి | క్రీణీత |
| ఉ. | క్రేష్యామి | క్రేష్యామః | క్రీణాని | క్రీణామ |

| | విధి | | క్రియాఽనిష్పత్తి | |
|---|---|---|---|---|
| | ఏ | బ | ఏ | బ |
| ప్ర. | క్రీణీయాత్ | క్రీణీయుః | అక్రేష్యత్ | అక్రేష్యన్ |
| మ. | క్రీణీయాః | క్రీణీయాత | అక్రేష్యః | అక్రేష్యత |
| ఉ. | క్రీణీయాం | క్రీణీయామ | అక్రేష్యం | అక్రేష్యామ |

ఈ పైన వ్రాసిన ౯వ తరగతిక్రియలు రెండువిధములు.

(౧) నకారముగాని, ణకారముగాని మఱియొకహల్లు క్రింద వత్తుగావచ్చునవి (ఉ. బధ్నాతి - పుష్ణాతి) వీనిలో నకారము ధకారముక్రింద నావత్తుగను, ణకారము షకారముక్రింద ణావత్తుగను వచ్చినవి, (౨) నకారముగాని, ణకారముగాని, మఱియొకహల్లుక్రింద వత్తుగా రాకుండ విడిగా వచ్చునవి. (ఉ. లునాతి-క్రీణాతి-వీనియందు, లునాతిలో నాయును, క్రీణా

తిఙో (రాయును) విడిగా నిలిచినవిగాని మఱియొక హల్లుక్రింద వత్తులుగా రాలేవు. నకార ణకారములు వత్తులుగావచ్చు క్రియ లన్నియు బధ్నాతివలెను, నకార ణకారములు వత్తులుగా రాక విడిగా నిల్చుక్రియలన్నియు క్రీణాతివలెను, ఆ యా కాలముల యందు చెప్పికొనవలయును. భేద మున్నచో వ్రాయఁబడును. [ ఇవి తొమ్మిదవ తరగతి క్రియలు. ]

| | |
|---|---|
| చటకః = పిచ్చుక | కిశోరః / పోతః = పిల్ల, పిల్లఁడు |
| బకః = కొంగ | |
| హంసః = హంస | సింహః = సింహము |
| కూర్మః = తాబేలు | లునాతి = కోయుచున్నాఁడు. |
| ఖరః = గాడిద | గృహ్ణాతి = తీసికొనుచున్నాఁడు, |
| ఖగః = పక్షి | [పట్టుకొనుచున్నాఁడు |
| మృగః = మృగము | లవిష్యతి = కోయఁగలఁడు |
| సరటః = తొండ | గ్రహీష్యతి = తీసికొనఁగలఁడు, |
| వ్యాధః = ఎఱుకలవాఁడు | [పట్టుకొనఁగలఁడు |
| శలలః = ఏదుపంది | క్రేష్యతి = కొనఁగలఁడు |
| వ్యాఘ్రః = పెద్దపులి | పుష్ణాతి = పెంచుచున్నాఁడు, |
| వరాహః = అడవిపంది | [పోషించుచున్నాఁడు |
| హరిణః = లేడి | పోషిష్యతి = పోషింపఁగలఁడు |

పురా ఏకస్మిన్వనే కతిచన మృగాః నివాసం అకుర్వన్. తేషాం మృగాణాం సర్వేషాం సింహః నృపః ఆసీత్. ప్రతిదినం సింహః వనస్థితాన్ అనేకమృగాన్ మారయిత్వా జీవతి స్మ.

తదా సర్వే మృగాః ఏకత్ర సమావిశ్య ఇత్థం ఆలోచయన్. 'అహో! ఏషః సింహః ప్రత్యహం అస్మాన్ సర్వాన్ మారయిత్వా భక్షయతి. ఏవంచేత్ శీఘ్రమేవ అస్మాకం కులం సర్వం నశ్యేత్, తతః కః ఉపాయః అస్మాకం జీవనవిషయే' ఇతి. తదా వరాహాద్యాః కేచనమృగాః ఉత్థాయ ఏవం అకథయన్. "వయంసర్వే సింహస్యసమీపం గత్వా 'హేసింహ! త్వం ఏకైక మృగక్రమేణ ఖాదిత్వా జీవనం కురు' ఇతి ప్రార్థయామహై. తతః సింహః కిం వదతి వా ఆకర్ణయామ" ఇతి. పరదినే మృగాః సర్వే తథైవ కృత్వా, సింహసమీపే పూర్వవృత్తాంతం వ్యజ్ఞాపయన్. సింహోఽపి అంగీకారం అదర్శయత్. అనంతరం వ్యాఘ్రవరాహశలలహరిణాద్యాః మృగాః సర్వే అతీవ సంతోషేణ యథేచ్ఛం వనే విహరంతిస్మ. ఏకదా శశపోతస్యవారః ఆగచ్ఛత్. తదా శశపోతః ఏవం ఆలోచయత్ 'అహం (యేన కేనాపి = ఏదోయొక) ఉపాయేన సింహం మారయిష్యామి. తతః వయం సర్వే మృగాః ఏతస్మిన్ వనే సుఖేన నివాసం కుర్మః' ఇతి ఆలోచ్య స్వస్యదినే ఈషదాలస్యం కృత్వా సింహసమీపం అగచ్ఛత్. తతః సింహః అతికోపేన అజ్వలత్.

ఒకనాఁడొక ఎఱుకలవాఁడు అడవిపందులను చంపుటకు అడవికి వెళ్ళెను. వానికి పందులు దొరకలేదు. పిమ్మట కొన్ని ఇతరమృగములను, పది పిచ్చుకలను, ఆఱుకొంగలను, ఒక ఏదుపందిని చంపి ఇంటికి తెచ్చుకొనెను. ఇట్లుండఁగా వాని శరీరమందు ఒకతొండ పడి కఱచెను. కాని ఆ యెఱుకలవాఁడు

చావలేదు. కొంతవఱకును వానిశరీరమంతయు చెడ్డది. పిమ్మట నొకవైద్యునొద్ద నౌషధమును (పుచ్చుకొనెను = అగృహ్ణాత్) ఆ కారణమువలన వాఁడు ఇట్లు చింతించెను– 'అయ్యో నేను చాలమృగములను జంపితిని. ఆ పాపమునకు ఫలము అప్పుడే కనఁబడినది. ఇఁక ముందు నే నెప్పుడును పాపకార్యములను జేయను. అది మొదలుకొని వాఁడు మార్గాంతరముచేత జీవనముచేసెనుగాని మృగములను చంపలేదు. చిట్టచివరకు ఒకపండితునియొక్క ఉపదేశముచే వాఁడు హరిభక్తుఁడయి స్వర్గమునకుఁ బోయెను. ప్రతివాఁడును పాపమును చేయరాదు. సత్కార్యమునే చేయవలయును. దానిచే నీలోకమునందును పరలోకమునందును (సుఖపడుదురు. = సుఖ్యేయుః)

## ఏకషష్టితమః పాఠః = అఱువదియొకటవ పాఠము

| పుంలింగము, ఇకారాంతము "హరి" శబ్దము=విష్ణువు | | | నపుంసకలింగము, ఇకారాంతము "వారి" శబ్దము = నీరు | |
|---|---|---|---|---|
| ప్ర. హరిః | - హరయః | [illegible] | వారి | - వారీణి |
| ద్వి. హరిం | - హరీన్ | | వారి | - వారీణి |
| తృ. హరిణా | - హరిభిః | | వారిణా | - వారిభిః |
| చ. హరయే | - హరిభ్యః | | వారిణే | - వారిభ్యః |
| పం. హరేః | - హరిభ్యః | | వారిణః | - వారిభ్యః |
| ష. హరేః | - హరీణాం | | వారిణః | - వారిణాం |
| స. హరౌ | - హరిషు | | వారిణి | - వారిషు |
| సం. హేహరే! | - హేహరయః! | | హేవారే! | - హేవారీణి! |

లవితవ్యః=కోయఁబడవలసినది గృహీత్వా = పుచ్చుకొని
లూనః=కోయఁబడినది లవిత్వా = కోసి
లవనం=కోయుట లవితుం=కోయన్, కోయుటకు
ద్రష్టవ్యః=చూడఁబడవలసినది. క్రీత్వా=కొని
దృష్టః = చూడఁబడినది క్రేతుం = కొనన్, కొనుటకు
కర్తవ్యః = చేయఁబడవలసినది విక్రియ = అమ్మి
సంగృహ్ణాతి=సంగ్రహించుచున్నాఁడు

అరే బాలక! త్వం అద్య ప్రాతఃప్రభృతి మంచాత్ ఉత్థాయ దంతధావనమపి నాకరోః ఖలు. త్వాం కిం కరవాణి? గచ్ఛ శీఘ్రం (తటాకసమీపం = తటాకాంతికం) ఝుటితి దంతధావనం కురు పశ్చాత్. దేవపూజార్థం పుష్పాణి తులసీదళాని చ లునీహి. ఏతస్మిన్దినే శ్రీహయగ్రీవోత్సవః అస్మాభిః కర్తవ్యః. హే తాత! పుష్పాణి (క్వ = కుత్ర) సంతి? కాని పుష్పాణి మయా లవితవ్యాని? త్వం కథయసిచేత్ అహం తథైవ కరిష్యామి. రే రామ! తవ అంబాం పృచ్ఛ; సా ఆజ్ఞాపయేత్. తథైవ ప్రవక్ష్యామి. అంబా క్వాగచ్ఛత్? అంబా ప్రాతరేవ గంగాయాంస్నాత్వా నిర్మలవస్త్రం ధృత్వా తులసీబృందావనసమీపే ఉపవిశ్య లక్ష్మీపూజాం కరోతి. తాం పృష్ట్వా శీఘ్రం త్వమపి పుష్పాణి లవిత్వా ఆనయ. హే అంబ! కాని మయా లవితవ్యాని వద? హేపుత్ర! నరసింహాలయే మల్లికాపుష్పాణి, జాతీపుష్పా

ణిచ అనేకాని సంతి. అర్చకాన్ పృష్ట్వా తాని పుష్పాణి సర్వాణ్యానయ. అర్చకాః నసంతిచే త్కింకర్తవ్య మంబ? తూష్ణీమే వాగచ్ఛ. తులసీదళాని అస్మదారామే స్థితాని లునీహి. ప్రథమతః దేవాలయం గత్వా మయా అర్చకాః ద్రష్టవ్యాః; తత్రార్చకాః సంతి చేత్, తాన్ పృష్ట్వా పుష్పాణ్యానేష్యామి; నోచే త్తూష్ణీ మే వాగమిష్యామి. తథైవ కురు. రేరే పూజాపాత్రం గృహీత్వా గచ్ఛ; నోచే త్కథం పుష్పాణి ఆనేష్యసి? తథైవ గచ్ఛేయం.

అమ్మా! దేవాలయములో మల్లెచెట్టుమీఁద తొండలున్నవమ్మా; నాకు భయము కలుగుచున్నది. నేను పోయఁజాలను; అన్నయ్యను పంపుము. పోనిమ్ముగాని బజారులో బెండకాయ లున్నచో కొనితెమ్మా. నాకు వాటియొక్కధర తెలియదమ్మా! నాన్నగారితోఁ జెప్పుము. చీదొంగకుంకా (ఎట్లైన = కథంచిత్) పాఱిపోవుటకు చూచుచున్నావు; చూడు రేపు నిన్నేమిచేయుదునో. పోనీగాని అక్కడ కూర్చుండి రామాయణమును చదువుము. అలాగే చదివెదనుగాని, ఆ పిల్లిపిల్లను నేను పెంచుకొందును; సరేనా. ఆపిల్లికూనతో నీకేమిపనిరా? ఆబాణలిలో నూనె పోయుము, దేవునిదగ్గర దీపమును వెలిగింతును. నారాయణాచార్యులగారికొడుకుపెం డ్లెప్పుడేమి? ఓరి విధవా! పెండ్లిసమాచారము నీ కెందుకురా చదువుకొనుమురా. అటులనే చదివెదనే; నా కొక అప్పచ్చి నీయఁగలవా? (అపూపః ―

అప్పచ్చి.) నిన్నటి అప్పచ్చి నేమిచేసితివి? నేను తినుచుండఁగా మామయ్యకోఁతి వచ్చి నన్ను భయపెట్టి యెత్తుకొనిపోయినది.

## ద్విషష్టితమః పాఠః = అఱువదిరెండవ పాఠము

| | | | |
|---|---|---|---|
| కాకః | = కాకి | పోషితుం | = పెంచుటకు |
| శుకః | = చిలుక | పోషిత్వా | = పెంచి |
| ఝిల్లికా | = కీఁచురాయి | యథాకాలం | = వేళతప్పకుండ |
| మయూరః | = నెమిలి | యథాశక్తి | = చేతనయినంతవఱకు |
| కుక్కుటః | = కోడి | మథ్నాతి | = చిలుకుచున్నాఁడు |
| గరుడః | = గరుడి | అశ్నాతి | = తినుచున్నాఁడు |
| గృధ్రః | = గ్రద్ద | లినాతి | = అంటుకొనిపోవుచున్నాఁడు |
| కృతః | = చేయఁబడినది | | |
| బంద్ధవ్యః | = కట్టఁబడవలసినది | వృణాతి | = వరించుచున్నాఁడు |
| గ్రహీతుం | = పుచ్చుకొనన్, పుచ్చుకొనుటకు | మంథిష్యతి | = చిలుకును |
| | | అశిష్యతి | = తినును |
| బంద్ధుం | = కట్టన్, కట్టుటకు | లేష్యతి | = అంటుకొనును |
| సంగృహ్య | = సంగ్రహించి | వరిష్యతి | = వరించును |

కాకస్య కాకపోతః రమణీయః. శుకానాం శుకకిశోరాః రమణీయాః. ప్రతిదినం అరణ్యే సర్వత్ర ఝిల్లికాః (రటంతి = అఱచుచుండును.) యుష్మజ్జనకేన విరచితః శ్లోకః కః? కిమరే బాలక! త్వయా కిమపి దౌష్ట్యం కృతం కిం? ఇతః పూర్వం కి మర్థం త్వా ముపాధ్యాయః అతాడయత్? ప్రథమతః ఏతత్పు

స్తకం త్వం గృహాణ. అనంతరం ఉపాధ్యాయస్య వృత్తాంతం కథయిష్యామి. ఆకర్ణయ, అస్మత్పాఠశాలాయాం ఏకః కుక్కుటః ప్రావిశత్. తదా మమ సమీపే ఆగచ్ఛత్. అహం తం కుక్కుటం హస్తేన గృహీత్వా అన్యబాలకస్య ఉపరి అపాతయం. తతః ఉపాధ్యాయః మాం దృష్ట్వా ఈష దకుప్యత్. నోచే త్కిమర్థం కోపిష్యతి? సత్యం అవదః; సముష్ట్వాం త్వం దుష్టః ఇతి సర్వే బాలకాః వదంతి. వదంతిచే ద్వదంతు మమ కిం భయం? ఇతః పూర్వం యుష్మత్పాఠశాలాయాం ఏకః మయూరః ఆసీత్. సః ఇదానీం న దృశ్యతే; కుత్రాస్తి రే? అస్మాకం వాక్యం ఆకర్ణయసిచేత్ తవ క్షేమః భవిష్యతి; నోచేత్ త్వం వృథా దుష్యేః. వర్షాకాలః ఆగచ్ఛతి. ఆకాశే సర్వత్ర మేఘాః దృశ్యంతే. యుష్మద్వాశ్వః తథా ధావతి; తం గ్రహీతుం అస్మాసు కోఽపి న సమర్థః.

మీ అమ్మ పెరుగు చిలుకుచున్నది గాని నేను పిలుచుచున్నానని యొకమారు పిలువుము. చీమలు నేతిగిన్నె యొక్క పై భాగమున అంటుకొనిపోయినవి. ఈ కాలమునందు ఎద్దులను పెంచుటకు నాకు సామర్థ్యము లేదు గనుక వాటిని పంపివేయుదును. ఎవరైనను కొందురేమో విచారించుము. ఏమండీ తాతాచార్యులుగారూ! మీ అమ్మాయిని మా అబ్బాయికిచ్చి పెండ్లి చేయుదురా లేదా? మా వల్ల మీ కెందుకు భయము? ఓ పిల్లలూ! మీరు మీ పాఠములను వేళతప్పకుండ నప్పగించితిరేని మిమ్మును మేము కొట్టము. నేను కొన్ని దినములు లోకగరు

డిని పెంచి మరల పంపితిని. బ్రతికినంతవఱకు, నేను చేతనయి నంతవఱకు నీకు విద్యను చెప్పెదనుగాని నీవు ఈ యూళ్ళో నుండి నా యొద్ద చదువుకొనుము. ఎందుకోగాని మీ తండ్రి నన్న నామీఁద కోపపడినాఁడు. మీ పిల్లవాఁడు మిగులనల్లరిని చేయుచున్నాఁడుగాని వానిని పట్టుకొని కట్టుఁడు. మా శిష్యులు ప్రతిదినమును యథావిధిగా సంధ్యావందనము చేయుచున్నారు. కొంచెము ధాన్యమును సంగ్రహించి పెట్టుము.

## త్రిషష్టితమః పాఠః = అఱువదిమూఁడవ పాఠము

స్త్రీలింగము-ఇకారాంతము
"మతి" శబ్దము = బుద్ధి

| | ఏ | బ |
|---|---|---|
| ప్ర. | మతిః | మతయః |
| ద్వి. | మతిం | మతీః |
| తృ. | మత్యా | మతిభిః |
| చ. | మత్యై / మతయే | మతిభ్యః |
| పం. | మత్యాః / మతేః | మతిభ్యః |
| ష. | మత్యాః / మతేః | మతీనాం |
| స. | మత్యాం / మతౌ | మతిషు |
| సం. | హేమతే ! | హేమతయః ! |

స్త్రీలింగము-ఈకారాంతము
"గౌరీ" శబ్దము = పార్వతి

| | ఏ | బ |
|---|---|---|
| ప్ర. | గౌరీ | గౌర్యః |
| ద్వి. | గౌరీం | గౌరీః |
| తృ. | గౌర్యా | గౌరీభిః |
| చ. | గౌర్యై | గౌరీభ్యః |
| పం. | గౌర్యాః | గౌరీభ్యః |
| ష. | గౌర్యాః | గౌరీణాం |
| స. | గౌర్యాం | గౌరీషు |
| సం. | హేగౌరి ! | హేగౌర్యః ! |

| | | | |
|---|---|---|---|
| మంథితవ్యః | = చిలుకఁబడ వలసినది | మంథిత్వా | = చిలికి |
| | | మంథంమంథం | = చిలికి చిలికి |
| మథితః | = చిలుకఁబడినది | నవనీతం | = వెన్న |
| మంథితుం | = చిలుకుటకు | మత్స్యః | = చేఁప |
| మంథనం | = చిలుకుట | జంబుకః | = నక్క |

అద్య తక్రం త్వయైవ మంథితవ్యం, తవాంబా బహి రాసీత్. బాఢం అహమేవ మంథిష్యామి : గృహే సుతరాం ఘృతం నాస్తి కిం కర్తవ్యం? నవనీతం అస్తిఖలు తత్ ద్రావయ ; ఏకదినస్య యథాకథంవా ద్రక్ష్యామః. తక్రమంథనానంతరం మమాంగవస్త్రం కూపసమీపం నీత్వా ఈషత్ ధావ. మమ ఇదానీం అవకాశః నాస్తి; భోజనానంతరం యుష్మద్వస్త్రం ధావేయం. గృధ్రాః తటాకస్థాన్సర్వాన్ మత్స్యాన్ ఖాదంతి. తీరే జంబుకః ఏకః ఉపావిశత్ పశ్య. యథాకథంవా గృధ్రం పాతయిత్వా ఖాదితుం తత్రాస్తి. తవ ఉపాధ్యాయః సర్వేషాం పుత్రాణాం వివాహాన్ అకరోత్ కిం? కథం కరిష్యతి? ఏషః క్షామకాలః ; అపిచ, అస్మదుపాధ్యాయః కాశీదేశస్థః, గౌడ బ్రాహ్మణః. తత్ర జీవనాభావేన అస్మద్దేశం ఆగత్య అత్ర జీవనం కరోతి. ఏవంస్థితే గౌడబ్రాహ్మణాః మత్స్యాన్ అశ్నంతీతి బహుజనాః వదంతి. తస్మాత్ కారణాత్ అస్మద్దేశే బ్రాహ్మణేషు ఏకోపి అస్మదుపాధ్యాయపుత్రేభ్యః కన్యాం న దాస్యతి; అతః తేషాం కథం వివాహాః భవిష్యతి?

ఎవరు మా చెఱువులో చేఁపలను పట్టుకొనుచున్నారు? ఏమో నే నెఱుఁగను. చాలకోఁతులు కొండదగ్గర నున్న చెట్లయందు వ్రేలాడుచున్నవో చూడుఁడు. మేము నిన్న నొక కోఁతిని పట్టుకొన్నాము. అది కొంతసేపు మా యింటిలో (నున్నట్లేయుండి=స్థితః ఇవ స్థిత్వా) పాఱిపోయినది. దానికొఱకు (వెదకుచున్నాను=మార్గయామి). నీకెక్కడనైనఁ గనఁబడెనా? తాతాచార్యులగారి యింటిమీఁద నొకకోఁతిని నిన్న చూచినాను. అదే మీ కోఁతియేమో! మాకు ఱోలు లేదుగాని యొకటి (అమ్మవచ్చినచో=విక్రేతుం ఆగచ్ఛేద్యది) విచారించి చెప్పుము, నేను కొనెదను. మీ అన్నకు ఏయూరిలో ఉద్యోగమయినది? నెల్లూరులో అయినది. అక్కడ అన్నిపదార్థములును దొరకునా? అన్నియును దొరకునుగాని నేయిమాత్రము మంచిది దొరకదు. అయినచో నెట్లు భోజనమును చేయుచున్నాఁడు? ప్రతినెల మనయూరినుండి నేను పంపుదును.

చతుష్షష్టితమః పాఠః = అఱువదినాల్గవ పాఠము

| | | | |
|---|---|---|---|
| కంకతికా = దువ్వెన | | వ్రణః | = కురుపు |
| శివకః | = గూటము | సాంద్రః | = దట్టనిది |
| పుంఖః | = పిడి | దర్శందర్శం | = చూచిచూచి |
| గోధనం | = ఆలమంద | బంధంబంధం | = కట్టికట్టి |
| అజకం | = మేకలమంద | అకృత్వా | = చేయకుండ |
| యూకా | = పేను | శ్రుత్వా | = విని |
| లిక్షా | = ఈపి | చిత్వా | = పోగుచేసి |
| | | విశ్వాసయతి | = నమ్మించుచున్నాఁడు |

పామా = గజ్జి
గ్రంథిః = ముడి
అలర్కః = వెఱ్ఱికుక్క
ద్రష్టవ్యః = చూడఁబడవలసినది
క్షాళయితవ్యః = కడుగఁబడవలసినది
సులభః = దొరకువది
దుర్లభః = దొరకనిది
శామ్యతి = తగ్గిపోవుచున్నది

డోలయతి = ఊచుచున్నాఁడు
ప్రసాధయతి = చిక్కుతీయు[చున్నాఁడు
శృణోతి = వినుచున్నాఁడు
శ్రోష్యతి = వినఁగలఁడు
చినోతి = పోగుచేయు[చున్నాఁడు
చేష్యతి = పోగుచేయఁగలఁడు

తాతాచార్యస్య పుత్రః గతదినే ఏకం శునకం దండేన అతాడయత్. సః శునకః అలర్కః. తస్మాత్ కారణాత్ సః శునకః తాతాచార్యస్య పుత్రం అప్పళాచార్యం పాదే అదశత్. అనంతరం కతిచిద్దినాని గతాని-తద్బాధా సర్వాపి అశామ్యత్. ఇదానీం తత్పాదే ఏకః వ్రణః ఉదతిష్ఠత్కిల. తం బాలకం (వైద్యాలయం = ఆసుపత్రిః) అనయన్. వైద్యః వ్రణం అచ్ఛేదయత్. ఇతః పరం కథం భవిష్యతి వా కేన జ్ఞాయతే. హే అంబ! అనుజస్య మస్తకే అతీవ యూకాలిక్షం అస్తి. తం ఆహూయ కంకతికయా తత్సర్వం అపనయ. రే రామ! ఆపణే ఏకం శివకం (నిఖాయ = పాత్రి) తత్ర మహిషం బధాన. తత్ర స్థితం గోధనం అజకం చ వనం చారయ. బలిష్ఠాచార్యాయ సీతాపతిః ప్రథమతః కన్యాం దాస్యామీతి కథయిత్వా అంతతః తం అవంచయత. కిమరే ఏవం విశ్వాస్య కంఠచ్ఛేదనం యుక్తం కిం?

యుష్మద్గ్రామే గుడం దుర్లభం కిం? ఘరట్టపుంఖః కుత్రాస్తి వా పశ్య. గృహే తండులపిష్టం నాస్తి. ఈషత్ భ్రామయిష్యామి. ప్రథమతః కన్యకా ద్రష్టవ్యా. అనంతరం వివాహః ఆలోచయితవ్యః. అద్య ఆకాశే మేఘాః సాంద్రాః సంతి. బహుశః వర్షం పతిష్యతి కింవా. పతిష్యతిచే ద్వయం సర్వేపి కృతార్థాః ఏవఖలు.

మీ తండ్రి యేమో చెప్పుచున్నాఁడు వినిరమ్ము. నీవు చెఱువుదగ్గరకు వెళ్లుచున్నావు. గనుక స్నానము చేయకుండ రావద్దు. మల్లెచెట్టుక్రింద పూవులు పడినవి గాని పోగుచేయుము. అరే నీ శరీరమునందు అంతటను గజ్జి అట్లున్న దేమిరా? వైద్యునియొద్ద ఔషధము పుచ్చుకొమ్ము. మాదున్న యెక్కడికో పాఱిపోయినది. చూచి చూచి వచ్చినాను. ఎక్కడను కనఁబడ లేదండి. నన్ను పురాణము చెప్పుమనెదవుగదా, ఎవరు వినఁగలరు? నేను ఒకఁడను వినఁగలను గదా. సరియే నీవు వినుము. నేను చెప్పెదను. నాకు బలము తగ్గిపోవుచున్నదిరా. ఇఁక మీఁద నేను చలినీటిలో స్నానమును చేయఁజాలనురా. పిల్లను ఊచుము. ఎందుకు నన్ను చూచి నవ్వెదవు? నీవు నవ్వించుచున్నావు గనుక నేను నవ్వుచున్నాను. నీకాలి మీఁద పుండెట్లున్నది? బొత్తుగా తగ్గిపోయినది. పిల్లకాయలందఱును నా మాటలను వినుచున్నారు. అయ్యో! మీకు మిక్కిలి డబ్బున్నది గదా దరిద్రులవలె మీ అమ్మాయి పెండ్లిని గుల్లో చేసితిరేమి? ఈ కఱవు కాలములో నిట్లు చేయవలె.

## పంచషష్టితమః పాఠః = అఱువదియైదవ పాఠము

| పుంలింగము—ఉకారాంతము<br>"గురు" శబ్దము = గురువు | | నపుంసకలింగము—ఉకారాంతము<br>"మధు" శబ్దము = తేనె | |
|---|---|---|---|
| ఏ | బ | ఏ | బ |
| ప్ర. గురుః | గురవః | మధు | మధూని |
| ద్వి. గురుం | గురూన్ | మధు | మధూని |
| తృ. గురుణా | గురుభిః | మధునా | మధుభిః |
| చ. గురవే | గురుభ్యః | మధునే | మధుభ్యః |
| పం. గురోః | గురుభ్యః | మధునః | మధుభ్యః |
| ష. గురోః | గురూణాం | మధునః | మధూనాం |
| స. గురౌ | గురుషు | మధుని | మధుషు |
| సం. హే గురో ! | హే గురవః ! | హే మధు ! | హే మధూని ! |

దర్శనీయః, దృశ్యః } చూడఁదగినవాఁడు

శ్రవణం = వినుట
శ్రోతుం = వినను, వినుటకు
చేతుం = ప్రోగుచేయను, ప్రోగుచేయుటకు

విజ్ఞాప్యః, విజ్ఞాపనీయః } మనవిచేసికొనఁదగినవాఁడు

శమయతి = ఆర్పుచున్నాఁడు.
ఖేలతి = ఆడుచున్నాఁడు.

లవ్యః, లవనీయః } కోయఁదగినవాఁడు,

మార్గయతి = వెదకుచున్నాఁడు
గలతి = జారుచున్నాఁడు

శ్రోతవ్యః = వినఁబడవలసినవాఁడు మధుపటలం = తేనెపట్టు

అరే తవ గురుః గంగాంప్రతి స్నానార్థ మగచ్ఛత్, ఘంటాద్వయ మాసీత్. ఏతావత్పర్యంతం కిం కరోతిరే తత్ర? మాం పృచ్ఛసి కిం? కిం కరోతివా! తథా హససి కిం రే? ఆగచ్ఛత్యాగచ్ఛతి. శీఘ్ర మంత ర్గత్వా పీఠం స్థాపయిత్వా పీఠోపరి దర్భాసనం ప్రసారయ. లవ్యాని పుష్పాణి ఝటితి లవిత్వా తత్ర (నిక్షి. ప=ఉంచుము.) దర్భాసనం కుత్ర స్తివా మమ నదృష్టం, అస్మద్గురుః తాడయిష్యతి కిం వా, కిం కుర్యాం భావ! మా త్రస్హీ పాపిష్ఠ! ఏతావత్పర్యంతం అహం సహస్రకృత్వః అవదం ఖలు, మమ వాక్యం అశ్రౌషీః కిం? భావ! భావ! అస్మద్గురుః రథ్యాయాం గళిత్వా అపతత్. తదుత్థానాంతరే దర్భాసనం మార్గయిష్యామి. తావదంతరే = (అంతలో) దర్భాసనం నలభ్యతే కిం? భావ! దర్భాసనం అలభ్యత. అస్మద్గురోః శరీరే సర్వత్ర పంకః కథమ స్తివా పశ్య. బత! పాపం, తస్య వస్త్రాణి సర్వాణి పంకమయాని ఆసన్. రేబాలక! తవగురుః అతీవ (కుపితః = కోపగించినవాఁడు) ఆసీత్. తతః దృశ్యం పాఠం దృష్ట్వా (అయత్తీభవ = సిద్ధముగానుండుము.) సః పంకా దుత్థాయ గృహం ప్రత్యాగత్య పంకం సర్వం ప్రక్షాళ్య అనంతరం శుభ్ర వస్త్రం ధృత్వా ఖలు మమ పాఠం వదిష్యతి. ఏతదంతరే అహం నాయత్తీభవేయం కిం? కిమర్థం మాం త్వరయసి?

పోనిమ్ము నా కెందుకు; నేను నిన్ను త్వరపెట్టనులే. నీయిష్టానుసారమే కానిమ్ము. నే నంతవఱకును ఆడుకొనుచుం

దును. మా వాకిట్లో నొక చెట్టుమీద మంచి తేనెప ట్టున్నది. దానిని పడవేసి ఆ తేనెను త్రాగుదము. నరేలే మీగురువుగారి భార్య బియ్యపుచేటను క్రింద పడవేసినది. నీవు వెళ్ళి ఆ బియ్యమును ప్రోగుచేయుము. ప్రోగుచేయుటకు నీకు శక్తి లేని యెడల మీ చెల్లెలిని పిలువుము. మా చెల్లెలు ఎక్కడనో ఆడుకొనుచున్నది. ఇప్పుడు నేను పిల్చినయెడల నది నామాటను వినదు. నీయొక్క వినుటతరువాత మీగురువుచేత నాకు కొంచెము తీర్థము నిప్పించుము. నాకాపురాణమును వినుటకు శక్తి లేదుగాని యింక నీపురాణమును కట్టిపెట్టుము. నిన్నరాత్రి నాకాలు పందికొక్కు కఱచినది. నేను కదలుటకుఁగూడ (శక్తి లేకుండ నున్నాను = అసమర్థః అస్మి). నన్నేమియు (బాధించెదవు = బాధసే) నీకు వీలున్నయెడల నీవు హరికథను వినుటకు వెళ్లుము. నాదేహమునిండ గజ్జి ఉన్నది. నేనును వెళ్ళను. (ఎవరును పోవద్దు = కేపి న గచ్ఛంతు.)

షట్షష్ఠితమః పాఠః = అఱువదియాఱవ పాఠము

గంతవ్యః = వెళ్ళఁబడవలసినది.
పఠితవ్యః = చదువఁబడవలసినది
పఠితః = చదువఁబడినది
పఠ్యమానః = చదువఁబడుచున్న
బాధ్యమానః = బాధింపఁబడుచున్న

సిచ్యతి = నెర వేయుచున్నది
సేత్స్యతి = నెర వేరఁగలదు
సాధయతి = నెర వేర్చుచున్నాఁడు
రోచతే = నయించుచున్నది

బాధితవ్యః = బాధింపఁబడవలసినది    మర్దయతి = మర్దించుచున్నాఁడు
బాధితః = బాధింపఁబడినది    లింపతి = పూయుచున్నాఁడు
లేప్స్యతి = పూయఁగలఁడు

శ్వః సాయం మంగళగిరిగ్రామే రథోత్సవః భవిష్యతి. తం ద్రష్టుం వయం సర్వే గమిష్యామః. యూయమపి ఆగమిష్యథ కిం? మయా పఠ్యమానం పుస్తకం అద్యసాయం సమాప్తం భవిష్యతి. ప్రథమపుస్తకం ఇతః పూర్వమేవ పఠితం. తథాపి అస్మదుపాధ్యాయం పృష్ట్వా ఆగమిష్యామి. మమ హస్తే ఈషదపి ధనం నాస్తి, తతః అహం ఘూమశకటం ఆరోఢుం న సమర్థః. అరేరే ఇతఃఇతః ఆగచ్ఛ, తత్ర వృశ్చికః ఇవ దృశ్యతే. దండం ఇత్థం ఆనయ; దండేన తంవృశ్చికం పీడయామి. రేపాపిష్ఠ! కిమర్థం వృథా తం బాధసే. ఛీదుష్ట! తూష్ణీంభవ తూష్ణీంభవ. వృశ్చికః సర్వైఃఅపి సర్వదా బాధితవ్యః ఏవ. ఏతావత్పర్యంతం బాధితః ఖలు; అలం ఇతః పరంవా [ముంచ=వదలు] ఇదానీం త్వం వృశ్చికం అబాధథాః. సః వృశ్చికః పరలోకే త్వాం బాధిష్యతే. బాధిష్యతేచేద్బాధతాం. ఇదానీం త్వాం అరక్షంఖలు తత్పుణ్యం కిం భవిష్యతి? తేన పుణ్యేన మమ పరలోకే బాధైవ న భవిష్యతి. త్వం ఉద్యోగార్థం ప్రయత్నం కరోషిఖలు; సః ప్రయత్నః సేత్స్యతి కిం? న సేత్స్యతిచేత్ త్వం న సాధయేః కిం? (ఏతస్య = అస్య) బాలకస్య కేశాన్ కంకతికయా ప్రసాధయ.

( నే నిపు డుత్తరమును చదువవలె = మయా ఇదానీం ఉత్తరం పఠితవ్యం ) ఎందు కాపిండిని అట్లు మర్దించుచున్నావు?

(భక్ష్యములనుచేయవలె = భక్ష్యాణి కర్తవ్యాని) మీ యింటిలో నేమి? మా అప్పాయి పెండ్లి. (నేటికెంతలో నున్నది = అద్య ప్రభృతి కియదంతరే అస్తి)? (ఇంకను పదిరోజులున్నది = ఇతోఽపి దశదినాంతరే అస్తి). సరేగాని అందుకోసమేనా మీ యిల్లు అంతటను అలుకుచున్నారు = (పూయుచున్నారు)? అవును కొఱకే. నేడు సందెవేళవఱకు అలుకఁగలరు. (నీ విపుడెక్కడికి వెళ్ళవలె? = త్వయా అద్య కుత్ర గంతవ్యం.) నీ తలలో పేలు చాల నున్నవిగాని నీవు మాయొద్దకు రావద్దు. మా తలలో పడఁగలవు. ఇదిగొఱకు మీ తలలో పేలు (లేవుకాఁబోలు = న సంతికిం వా). చూడుచూడు నీ తలలో ఈపి యెల్లున్నదో! మీ తమ్ముని మాతోకూడ మా యింటికిఁ బంపెదవా? అక్కడ (నిప్పు = అగ్నిః) ఉన్నది, కొంచెము (చల్లార్చుము = శమయ). అలాగే అప్పుడునుగాని కొంచెము నీరు తెమ్ము. చాలు పోరా నీవు మంచివాఁడవు కావు; మా నాన్న వచ్చినయెడల కోపపడఁగలఁడు. మీ నాన్న యెక్కడికి వెళ్ళినాఁడు; ఇంటిలో లేఁడా?

## సప్తషష్టితమః పాఠః = అఱువదియేడవ పాఠము

రూపకం = రూపాయి
ఆణకః = అణా
ద్రమ్మః = దమ్మిడీ
మానికా = మానిక
ప్రస్థః = తూము
రిక్తః = వట్టి

సాధయితవ్యః = సాధింపఁబడవలసిన
సాధనీయః = సాధింపవలసిన
సాధ్యః = సాధింపఁదగిన

ఖండశః = తునకలుగా సాధయితుం = సాధించుటకు

ద్విధా = రెండుగా లేప్తుం = పూయుటకు; అలుకుటకు

మూల్యం = వెల [న్నాడు. లిప్త్వా = పూసి, అలికి

విభజతి = భాగించుచు గోమయతి = మెత్తుచున్నాడు

ఏకం రూపకం గృహీత్వా ఆపణం గచ్ఛ. తత్ర ఉర్వారుక ఫలాని సంతిచేత్ సమ్యక్ మూల్యం విచార్య ఏకాణకమూల్యాని ఆనయ. ప్రస్థమాత్రం ధాన్యం, ద్రమ్మస్య సస్యం ఆనయ. సస్యం ముఖ్యం రే, సస్యఫలం రిక్తం ఆసీత్. గృహే జీరకః అస్తివా నవా పృచ్ఛ, అస్తిచేత్ మాస్తు, నోచేత్ జీరకమప్యానయ. దార్వికాఫలాని కతి సంతివా గణయ. నారికేళఫలమస్తి చేత్ (భిత్త్వా = బద్దలుకొట్టి) ఖండశః కృత్వా చోష్యే పాతయేతి అంబాం వద. తత్ర అనేకే పండితాః సంతి, తేభ్యః సర్వేభ్యః దక్షిణాం యచ్ఛతి. మా త్రస, యథాకథంవా త్వత్కార్య సాధనప్రయత్నం కురు. తత్కార్యం సాధ్యంవా అసాధ్యం వా? హేగురో! తత్కార్యం అసాధ్యమివాస్తి-కుత ఇతిచేత్ మాతులపుత్రః మమవచనం నశృణోతి. యూయం అశృణుత ఖలు తస్య వృత్తాంతం సర్వం అపి; సః ఏకాం కాంతాం పర్యణయత్. సా కాంతా విధవా ఇతి అహం అశృణవం, (అద్యతనాః = ఇప్పటివారు) సర్వేపి కుపితాః ఆసన్, కిం కర్తవ్యమ్?

మన దొడ్డిగోడను మెత్తుచున్నా రెందుకు? నీపండును ఎవరు తిన్నారు? మా తమ్ముడు తిన్నాడు. అందుకొఱకేనా

చిన్న వానిని నీవు కొట్టినావు? అవును. నా పంతును తినిన యెడల నే నూరకుందునా యేమి? ఆగోడను అలికి అన్నను ఇట్లు రమ్మనుము. ఒకముంగి చిన్న పామును పట్టుకొని ముక్కలు ముక్కలుగా చేసి మా దొడ్లో పారవేసినది. ఆగది యెవరిది, ఈగది యెవరిది? అది నాది, ఇది మా తమ్మునిది. మీ తమ్ముని భార్యయును కాపురమునకు వచ్చెనా? ఈబట్టను రెండుగా భాగించుము. మాసికలో నేమియున్నదో చూడుము. మీ వంటయింటిగోడ పూయుటకు నెవరు వెళ్ళినారు? అన్ని గోడలను మాదాసియే పూయుచున్నది. పూర్వకాలమున విధవావివాహము లున్నను ఇప్పటిపండితులు (అంగీకరింపరు = నాంగీకుర్వంతి) గాదెలో ధాన్య మున్నదా? గాదె చిన్నదే వట్టిది అయినదిగా. మన యింట్లో పెండ్లి యుండేగదా, తాతాచార్యులుగారికుమారులు చిన్న [ఒకరొకరు=పరస్పరం] కొట్టుకొనుచున్నారు.

## అష్టషష్టితమః పాఠః=అరువదిఎనిమిదవ పాఠము

క్వత్యః | ఎక్కడివాఁడు?
కుత్రత్యః | ఎక్కడిది?
ప్రాచ్యః = తూర్పువాఁడు
దాక్షిణాత్యః=దక్షిణపువాఁడు

పాశ్చాత్యః = పడమటివాఁడు
ఔత్తరాహః=ఉత్తరపువాఁడు

భాతి=ప్రకాశించుచున్నాఁడు
[శోచుచున్నాఁడు
వాతి =వీచుచున్నాఁడు
మాతి=ఇముడు-కొలుచు
[చున్నాఁడు
యాతి=వెళ్లుచున్నాఁడు
యాపయతి=గడపు - పంపు
[చున్నాఁడు

భాగః = భాగము    ప్రయాతి = ప్రయాణ మగు
పూర్ణః = నిండినవాఁడు    [చున్నాఁడు
సువర్ణం = బంగారము    గిళతి = మ్రింగుచున్నాఁడు
విందతి = పొందుచున్నాఁడు    విభజ్య = భాగించి

తే బాలకాః కుత్రత్యాః వా పృష్ట్వా ఆగచ్ఛ. తే సర్వేపి దాక్షిణాత్యాః ఏవ; తేషాం వస్త్రాదికమేవ కథయతి, తే ఔత్తరాహాః న భవేయురితి. పాశ్చాత్త్యానాం అస్మాకంచ భేదః సమ్యక్ దృశ్యతే. తేషాం వర్ణః శ్వేతః, అస్మాకం తు నీలవర్ణః తస్మాదేవ తేషాం శ్వేతముఖాః ఇతి నామధేయం అస్తి. త్వత్సమీపే స్థితం సర్వమపి ధనం విభజ్య అర్ధభాగం తవ అనుజాయ దేహి. తటాకః కదా పూర్ణః? ప్రపూర్వేద్యుః [రాత్రిందివం= రేయింబగలు] సమ్యక్ అవర్షత్ఖలు, ఏకస్యాం రాత్ర్యాం ఏవ సంపూర్ణః ఆసీత్. ఇతః పరం వత్సరచతుష్టయపర్యంతం జలస్య క్షామః నాస్తి. [శాలిక్షేత్రాణి = వరిపొలములు] ఏతద్వత్సరే సమ్యక్ ఫలిష్యంతీతి భాతి - అరే తవ గుణాః మహ్యం న రోచంతే, తవ సమాచారః సుతరాం సమ్యక్ నాస్తి. ఇతః ప్రభృతి [ప్రాతఃఉత్థాయ = ప్రాతరుత్థాయ] స్నానం శీతోదకే కురు. అనంతరం సంధ్యావందనాదికం యథావిధి కురు. తతః హ్యస్తనశ్లోకచింతనాం కురు. అద్య పఠనీయం పాఠం సమ్యక్ విచారయ. ఏవంచేత్తవ వచనం అంగీకరిష్యామి నోచేత్తవ గతి స్తవ, మమ గతి ర్మమ. ఔషధం కథమపి గిళ, ఆరోగ్యం శీఘ్రమేవ విందేః.

నిన్న నేను [గ్రహచారముచాలక = గ్రహచారహీనః] సంభావనకోసము పెండ్లిచోటునకు వెళ్ళితిని. సంభావన లేదు సరిగదా యజమానుఁడు కఱ్ఱ తీసికొని నన్ను కొట్టవచ్చినాఁడు. నీ విప్పుడెక్కడకు ప్రయాణమగుచున్నావయ్యా? ఎక్కడికని అడిగినావు; కాశీనగరము బాగుగనేయున్నది. ఇఁకనాపని బాగుగనే నెరవేరును. అంతుల చెప్పుటకును [అడుగరాదు = న ప్రష్టవ్యం] అందుచేతనే నేను నిన్న దుఃఖము ననుభవించితిని. నీబట్టలు నాపెట్టెలో (పట్టవు = ఇముడవు) గనుక నీపెట్టెలోనే (పెట్టుకొనుము = నిక్షిప) మీరెట్లైనను ముహూర్తమును గడపి వెళ్ళుఁడు. నాభాగమును నాకు పంచిపెట్టుము. మా యూరు సముద్రపుటొడ్డున నున్నది; గనుక అక్కడ నెండకాలపుబాధ లేదు. మీ కేమండి మీ రెప్పుడును డబ్బుతో నిండినవారు, నాదగ్గర నేమియున్నది? ఒకదమ్మిడియును లేదు. నీవు చాల చతురుఁడవు గాని ఇఁక నూరకుండుము. నాకంటె (మదపేక్షయా) నీవే డబ్బుతో నిండినవాడవు. నీ వెంతమాత్రము దరిద్రుఁడవుకావు. వట్టిమాటలతో నేమి ప్రయోజనమున్నది? లేచిపో.

## ఏకోనసప్తతితమః పాఠః = అఱువదితొమ్మిదవ పాఠము.

దక్షిణతః = దక్షిణముగా
పురతః = ముందుగా
చణకాః = సెనగలు
ముద్గాః = పెసలు
వ్యాఖ్యాతి = వ్యాఖ్యానము చేయుచున్నాఁడు
గాళయతి = గాలించుచున్నాఁడు

గోధూమాః = గోధుమలు
కుళుద్థాః = ఉలవలు
రాజమాషాః = అలచందలు
బీజః = గింజ
వాయుః = గాలి
ప్రమాదః = పొరపాటు
విరమతి = చాలించుచున్నాఁడు
ప్రస్థాపయతి = పయనము చేయించుచున్నాఁడు
గర్వతి = గర్వపడుచున్నాఁడు
ప్రమాద్యతి = పొరఁబడుచున్నాఁడు
ప్రసాదయతి = బ్రతిమాలుకొనుచున్నాఁడు
లోటతి = కెలుకుచున్నాఁడు
ష్ఠీవతి = ఉమ్మివేయుచున్నాఁడు
గువతి = ఏఱుగుచున్నాఁడు
లుంపతి = త్రుంచుచున్నాఁడు

అద్యప్రాతః కస్య ముఖ మపశ్యం వా వామపాదే కంటకః అలగత్. పూర్వేద్యుః రాత్రౌ చణకాన్ అభక్షయం, ఉదరే శూలాఉత్పన్నా, అతః బహుకృత్వః బహిర్గమనావసరః ఆసీత్. తేషాం గృహే ప్రతిదినం ముద్గసూపమేవ కుర్యుః. మమవచనం కః శ్రుణుయాత్ ? నకోపి శ్రుణోతి. కుళుత్థాన్ పక్త్వా అశ్వేభ్యః అయచ్ఛన్ కిం? పాత్రస్థితాన్సర్వకుళుద్థాన్ తాతాచార్యః చోరయిత్వా ఆవరణే కుత్రాపి కోణే ఉపవిశ్య అభక్షయత్. ఏవం చౌర్యం కరోతి చేత్ తం అస్మద్గృహాత్ శీఘ్రం ప్రస్థాపయిష్యామి. కుళుద్థాదికాన్ గిళిత్వా అనంతరం దేవపూజాం కరిష్యతి కిం వా సః శీఘ్రమేవ అస్మద్గృహాత్ బహిష్కర్తవ్యః. విరమ విరమ సః అత్రైవాగచ్ఛతి. గోధూమపిష్టే పిపీలికాః సంతి; సమ్యక్ వస్త్రేణ గాళయ. తవోపాధ్యాయస్య త్వయి కోపః సమ్యగా గచ్ఛేత్, శీఘ్రం గత్వా తం ప్రసాదయ. బాలకః అంగణే

గుపని. పానీయం సర్వం తథా లోలసి కిమర్థం రే? అహం న, యుష్మద్గోపాలః పాత్రే అమూత్రియత్. అహమేవ మహా పండితః ఇతి కిమర్థం తథా గర్వసి? అరే గంపాల! కిమర్థం మయి ష్ఠీవసి? నావశ్యం నావశ్యా, యూయం తత్రిష్ఠ కిం? (క్షమధ్వం క్షమధ్వం = క్షమింపుఁడు క్షమింపుఁడు.)

మా చెట్టుయొక్క ఆకులను త్రుంచవద్దు, చెట్టు చచ్చును. ఇంట్లో మినపగింజ లేమయిన నున్నవా? సన్నరాత్రి బొత్తిగా గాలి వీచలేదు. శ్రావణమాసమందుకూడ వేసవికాలమువలె నున్నది. దక్షిణముగా వెళ్ళుటకు వీలు లేదు. లేకపోయిన యెడల ఉత్తరముగా వెళ్ళుఁడు. అక్కడ నెవరో ఉన్నారు. ఇక్కడ ఉమ్మివేయవద్దు. ఇక్కడ అలికినాము. మీ తండ్రి యిక్కడ కూర్చుండి సంధ్యావందనమును చేయఁగలఁడు. మా తండ్రి సంధ్యావందనమును (మఱచిపోయినాడు = వ్యస్మరత్). బెండగింజలున్నయెడల [ పాదుచేసి—ఆలవాలం కృత్వా ] పెట్టుము. నా గ్రంథము నెవఁడు వ్యాఖ్యానము చేయుచున్నాఁడు? మీ గురువుగారే. అరే ఈ శ్లోకముదగ్గర ఆయన పొరపడి నాఁడు. గురువునకుఁగూడ పొరపాటా? గురువైననేమి గిరువైననేమి? మీపొలములో సస్యము పండినదా? మాపొలములో దర్భలు (పెరుగుచున్నవి = వర్ధంతే) ఇవ్వేళ గుమ్మడి గింజ మొలచినది. ఎందుకు మాటిమాటికి వాసిని అటుల బ్రతిమాలెదవు? ఏటుకూరికి త్రోవ యేదండి? ఉత్తరముగా పోయి మరల ఎడమప్రక్కగా పొండు. అక్కడ నొక త్రోవ కనఁబడును. అదే యేటుకూరి దారి.

## సప్తతితమః పాఠః = డెబ్బదియవ పాఠము

| | |
|---|---|
| చాలినీ = జల్లెడ | భవితవ్యం = కావలసిన, కాఁదగిన, ఉండవలసిన |
| లలాటం = నొసలు | |
| కేశాః = తలవెంట్రుకలు | యాహి = వెళ్ళుము |
| నామధేయం = పేరు | భృజ్జతి = వేఁగించుచున్నాఁడు |
| నఖః = గోరు | లాజతి = పేలాలు వేఁగించుచున్నాఁడు |
| చిబుకః = గడ్డము | |
| అంగుళిః = వ్రేలు | సించతి = తడుపుచున్నాఁడు |
| అంగుష్ఠం = బొటనవ్రేలు | సిక్త్వా = తడిపి |
| సింఘాణం = చీమిడి | ముంచతి = విడుచుచున్నాఁడు |
| దూషికా = పుసి | మోచయతి = విడిపించుచున్నాఁడు |
| నాసా = ముక్కు | |
| తిలకం = బొట్టు | బంధనం = కట్టుబాటు |
| స్థాతవ్యః = ఉండవలసిన, నిలువవలసిన | కూజతి = కూయుచున్నాఁడు |
| | చలయతి = జల్లించుచున్నాఁడు |

హే అంబ ! తండులపిష్టే అనేకే మశకాః అపతన్, చాలిన్యా ఈషత్ చలయ. అహం సాయంకాలే ధాన్యమానేష్యామి లాజిష్యసి కిం? తవ లలాటే తిలకం నాస్తి కిం రే? మధ్యాహ్నే అధరం, పరంతు ఇదానీం అనశ్యత్. యుష్మాభిః అస్మద్వ్యవహార పరిష్కారపర్యంతం అత్రైవ స్థాతవ్యం. తత్రైవ స్థాస్యామః. ఇదానీం యుష్మత్సోదరాణాం వ్యవహారపరిష్కారం భవిష్యతి కిం? నో చేత్ దుర్న్యాయమేవ పరిష్కురుత. మమాంగుష్ఠే పిటకః

కంటకః అలగత్. తవ చిబుకే పామా (స్ఫోటః=పొక్కు) ఇవ దృశ్యతే. హంజే! స్తనపస్య (నాసికాయాం = నాసాయాం) సింఘాణం లంబతే, అపనయ. రమణాం బాయాః కేశాన్ సమ్యక్ ప్రసాధ్య పుష్పైః అలంకురు. హేబలిద్ధాచార్య! తవభార్యాయాః నామధేయం కిం?; ఈషత్కథయసివా! మమ లజ్జాఖలు! యుష్మద్భార్యాయాః నామధేయం యూయం వదిష్యథ కిం! ఏకః గజః ఆగత్య తటాకే అమజ్జత్. జలం సర్వం (పంకిలం=బురదచే నిండినది) ఆసీత్. కస్య వా గృహం జ్వలతి, ఈషత్ జలేన శమయ. మమాంగవస్త్రం సిక్త్వా ఆనయ. చణకాన్ భృజ్జసి కిం? నహినహి మాషాన్ భృజ్జామి. సః శుకః బంధనే పతిత్వా కూజతి; తం బంధనాత్ మోచయిత్వా యత్రకుత్రాపి వృక్షే ముంచ. త్వం అద్య శుకపురం యాహి పునః దినపంచకానంతరం అత్ర ఆయాహి. అరే కా వా విధవా అభిముఖం ఆయాతి రే. ఇదానీం మా యాహి; శ్వః యాయాః కింతు తిష్ఠ.

ఓ పిల్లలారా! మీకు పరీక్షాసమయము దగ్గఱకు వచ్చుచున్నది భయపడవద్దండి. పరీక్షయందు అన్ని ప్రశ్నలకును జవాబు వ్రాయుఁడు. ఒక్కప్రశ్నను కూడ విడువవద్దండి. నీకు చేతిమీద గజ్జిపొక్కులున్నవి కాబోలు, నీవెట్లువ్రాయుదువు! ఆవేళకు నశించవండి. మీఅనుగ్రహ మున్నయెడల నేను ధైర్యముతోనే వ్రాయఁగలను. నాకేమియు భయముఁ లేదు; కాని పరీక్షయందు ప్రశ్నపత్రము లెట్లుండునో! నాకు హూణ భాషయందు, భూగోళమునందు, దేశచరిత్రమునందు, సంస్కృతమునందును బాగుగనే ప్రవేశ మున్నదిగాని, గణితమందు

మాత్రము బొత్తుగా ప్రవేశము లేదండి - రూపాయికి అణాలు ఎన్ని అని అడిగినచో చెప్పలేనండి - కాఁబట్టి గణితములో నే నాకు భయము. భయపడినయెడల నేమిలాభము? ధైర్యముతో గణితమును ఎక్కువగా అనేకపర్యాయములు పఠించుము. అప్పుడు నీకు భయ ముండదు. పరీక్షయందు జయమును పొందినచో నాలుగు టెంకాయలను కొట్టెదను. నే నిక్కడ నుండవలెనో, వెళ్ళవలెనో మీనాన్న నడిగిరమ్ము - ఉండు మనినచో నుందును; పొమ్మనినచో పోదును. నాకేమాటయుఁ దెలియలేదు.

ఏకసప్తతితమః పాఠః = డెబ్బదియొకటవ పాఠము

క్రియమాణః = చేయఁబడుచున్న
మగ్నః = మునిఁగిన
సిక్తః = తడుపఁబడిన
బద్ధః = కట్టఁబడిన
ముక్తః = విడువఁబడిన
భృష్టః = వేఁగించఁబడిన
కీటః = పురుగు
సద్భావః = ఉండుట
ఘాసః = గడ్డి
ఘోషః = పల్లె
గ్రామః = ఊరు
ఘాణా = గానుగ
సమాప్తః = ముగిసిన

సంకుచతి = ముడుచుకొనుచున్నాఁడు, మోమోట పడుచున్నాఁడు
లోహితాయతి = ఎఱ్ఱబాఱుచున్నాఁడు
వృషస్యతి = ఎదవుచున్నది
పరిష్కరోతి = పరిష్కరించుచున్నాఁడు
అపహరతి = అపహరించుచున్నాఁడు
వ్యవహరతి = వ్యవహరించుచున్నాఁడు
సంహరతి = చంపుచున్నాఁడు

తిలఘాతకః = తెలికలవాఁడు    అవహంతి = దంపుచున్నాఁడు
శ్రామ్యతి = అలయుచున్నాఁడు    అవఘ్నంతి = దంపుచున్నారు
మాహి = కొల్చుము,    దళతి = పగులుచున్నది
[ఇముడుము    విదారయతి = చీల్చుచున్నాఁడు

యుష్మాభిః క్రియమాణం కార్యం సమాప్తం చేత్ భో శిష్యాః! శీఘ్రం పుష్పవనం గత్వా స్వామిపూజార్థం పుష్పాణి ఆనయత. హంజే! దేవాలయే దీపః అస్తి వా న వా పశ్య. తైలాభావాత్ నక్తమేవ దీపః అశామ్యత్. తర్హి తిలఘాతకగృహం గత్వా తైల మానయేతి రామం ప్రతి వద. తథైవ వదిష్యామి. తిలఘాతకః ఇదానీమేవ తిలాన్ ఘాణాయాం పూరయిత్వా ఘాణాం భ్రమయితుం ఆరభత. ఈషత్కాలం స్థిత్వా ఆగచ్ఛేతి అవదత్. చణకాః భృష్టాః కింవా అంబాం పృచ్ఛ? అస్మద్వత్సః ఆవరణే శివకే కేన బద్ధః? యుష్మద్వత్సం రాత్రౌ అహమబధ్నాం. అద్య ప్రాతః సుబ్రహ్మణ్యః పునరపి అమోచయత్. పూర్వేద్యుః తటాకే మగ్నః గజః కుత్రాగచ్ఛత్? ఏకః అలర్కః అస్మద్గ్రామే సంచరతి; తం పాదే అతాడయన్; తస్య పాదః భగ్నః ఆసీత్. సః ఇదానీం కుత్రాస్తి వా న జ్ఞాయతే. మమాంగవస్త్రం కేన సిక్తం? ఘోషాత్ గోపికా ఆగతా వా? నహి. రేరే తైలపిష్టే కీటాః ఇతస్తతశ్చలంతి, శోధయ. యుష్మాకం ధనసద్భావాత్ యథాపేక్షితం తథా ఖేలథ. అస్మాకం కిమస్తి? వయం సర్వదా నిర్ధనాః. అస్మద్బహుళా అవృషస్యత్ కింవా, కంచన షండం మార్గయ రే. మాషాన్ మానికయా మహి.

మా పిల్లవాఁడు చదివిచదివి మిక్కిలి అలసినాఁడు. సూర్యుఁడు కొంచెముకొంచెము ఎఱ్ఱబాఱుచున్నాఁడు. నా చెంబు నెవఁడో అపహరించుచున్నాఁడు చూడుము. ఒక సింహము నిన్నటి యేనుఁగును గోళ్ళతో చీల్చుచున్నది. ఇఁక నీవు వంటచాలించుము. (చాలప్రొద్దయినది = మహాన్కాలోగతః) కొంచెము నూనెనిటు తెమ్ము, శరీరమునందు పూసికొని స్నానము చేయుదును. పాము పఱుగిడుచున్నది. చంపుము. ఎవఁడు సంహరింపఁగలఁడు (నేను చంపలేను = మారయితుం నశక్నోమి) మల్లె పూవులు ముడుచుకొనుచున్నవి. (కాకులు కూయుచున్నవి = కాకాః రటంతి) మీయింటిలో ధాన్యమును దంపుచున్నారేమి? రేపు మా తాతగారి పెండ్లి. నీ కాలిమీఁద కురుపు పగిలినదా? లేదు; ఇంకను చాల బాధపెట్టుచున్నది. మినపప్పచ్చులను తినుము, రేపో యెల్లుండో పగులఁగలదు. మన దొడ్లో గడ్డి యున్నదా లేదా? గొల్లవాఁడు ఆవును ఇంకను ఎందుకోసము తోలుకొని పోలేదు? ఇపుడేకా ఎనిమిదిగంటలు అయినది; పదిగంటలైనతరువాతగదా వాఁడు ప్రతిదినమును వచ్చును. (ఇంతలోనే త్వరపడెదవేల = ఏతదంతరే ఏవ త్వరసే కిం?). కొంచెము కాలమును చూడుము వాఁడే వచ్చును.

ద్విసప్తతితమః పాఠః = డెబ్బదిరెండవ పాఠము

పితామహః = తండ్రితండ్రి పరిష్కృత్య = పరిష్కరించి
పితామహీ = నాయనమ్మ పరిష్కర్తుం = పరిష్కరించుటకు
మాతామహః = తల్లితండ్రి

మాతామహీ = అమ్మమ్మ
మాతులానీ = మేనమామ [భార్య
భాగినేయః = తోఁబుట్టువు [కొడుకు
కీదృశః = ఎటువంటివాఁడు
తాదృశః = అటువంటివాఁడు
త్వాదృశః = నీవంటివాఁడు
యుష్మాదృశః = మీవంటివాఁడు
మాదృశః = నావంటివాఁడు
అస్మాదృశః = మావంటివాఁడు

విశ్రామ్యతి = విశ్రమించు [చున్నాఁడు
నిద్రాతి = నిద్రపోవుచున్నాఁడు
విరమ్య = చాలించి
విరంతుం = చాలించుటకు
విశ్రమ్య = విశ్రమించి
విభజ్య = విభజించి
స్నాతి = స్నానముచేయుచు [న్నాఁడు
స్నాహి = స్నానముచేయుము
స్నాస్యతి = స్నానము చేయఁ [గలఁడు.

తవ పితామహః గ్రామే అస్తి వా? తాదృశః బాలకః కుత్రాపి నాస్తి. యుష్మద్భాగినేయస్య ఉపనయనం ఆసీద్వా? అస్మాదృశానాం వృద్ధానాం సర్వదా యుష్మాదృశైః బాలకైః సేవా కర్తవ్యా. తేషాం వ్యవహారం పృచ్ఛ. పాకః ఆసీత్కింవా? దేవతార్చనార్థం కః స్నాస్యతి? యూయం స్నాత. అరే ఇదానీమపి నిద్రాసి కింరే. ఘంటాదశకం ఆసీత్. ఉత్తిష్ఠ, ఉత్తిష్ఠ, దంత ధావనం కురు. ముఖప్రక్షాళనానంతరం పుష్పాణి విభజ్య కానిచి త్పుష్పాణి రామాయ దేహీ. కానిచి త్పుష్పాణి అనుజాయై

దేహి. బాలకాః సర్వేపి కథం డోలాయంతే వా పశ్య. త్వం కదా వా తథా అడోలాయథాః కిం? మమ పతేయం కింవా ఇతి అధికభయం. ఆతపే ఆగచ్ఛః తస్మాత్ ఈషత్కాలం అస్మద్గృహే విశ్రమ్య గచ్ఛ. అరే దేవగృహే దీపః నాస్తి ప్రజ్వాలయ. మమాంగుష్ఠః పాషాణప్రహారేణ అదళత్, నఖః ఉదతిష్ఠత్. తర్హి త్వం కథం స్నాస్యసి? తవ వివాహార్థం మాతులపుత్రికా అస్తి ఖలు? అస్తి చేత్కిం, మహ్యం దాతుం మాతులాన్యాః అభిప్రాయః నాస్తి. మమ మాతులః అస్వతంత్రః; ఈషదపి కార్యం కర్తుం నశక్నోతి; తస్మాత్కథం భవిష్యతి వా. కేన జ్ఞాయతే?

శ్రీరాముఁడు తనతండ్రియొక్క ఆజ్ఞచేత అరణ్యమునకు వెళ్లెను. అక్కడ శూర్పణఖ రాముని చూచుటకు వచ్చెను. మీవంటి చక్కని పురుషులు లోకమం దెక్కడను లేరు. కనుక నిన్ను పెండ్లాడుటకు వచ్చితిని, నన్ను (గ్రహింపుము= గృహాణ,) అని అడిగెను. అప్పుడు రాముఁడు శూర్పణఖకొఱకు లక్ష్మణుని జూపి వీనివంటి సుందరపురుషుఁడు నీకు దొరకఁడు; వీనిని పెండ్లాడుమని చెప్పి పంపెను. అపుడు శూర్పణఖ లక్ష్మణునిచెంతకు వెళ్ళి (మునుపటివలెనే = యథాపూర్వం) అడిగెను. అంతట లక్ష్మణుఁడు ఆమెయొక్క ముక్కును కర్ణద్వయమును కోసెను. నే నిపుడు నిద్రపోవుచున్నానుగాని నాతో కూడ సంభాషణమును చాలింపుము. ఇపుడు నిద్రపోవుచున్నావేమయ్యా! భోజనమునకు వేళ అయినది లెమ్ము లెమ్ము.

